# SREE
# VASAVI VILASAM

(10 SCENES)

AUTHOR :

VIDWAN BALAKAVI SIMHA ASHTAVADHANI

SOMPALLE KRISHNAMURTI

**KOKKANTI, KADIRI TALUK,**

ANANTAPUR DISTRICT.



PRINTED AT

B. P. WORKS, MADANAPALLE

**1936**



Price **1 4 0**

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# శ్రీ వాసవీ విలాస ముద్రణము.

## ప్రధాన పోషకులు.

1. శ్రీ; పబ్బిసెట్టి, వేంకటరామయ్యసెట్టిగారు. కొక్కంటి, కదిరి తా॥

చ॥ మిత్రావరుణాఖ్యగోత్రుఁడు; - మితుఁడు; శ్రీపదిసెట్టివంశ స
త్పుత్రుఁడు; లక్ష్మమాంబకును, - బాపనసంబ్రియపుత్రికిఁ; దక్షసే
వక; సతి రంగమాంబ పతి; - ధన్యుఁడు; వేంకటరామయార్యుఁడే
ప్రకటిని సర్వసౌఖ్యపరి - వ్యాప్తియు శ్రీయును నాయు వందుతన్! ॥

2. శ్రీ; జయము, రామకృష్ణయ్యసెట్టిగారు. చౌడసముద్రము,
మదనపల్లె తాలూకా.

శా॥ నెమ్మిన్, మాలకులాఖ్యగోత్రభవుఁడై, - నిష్ఠాత్ముఁడై, మేటి సౌ
ఖ్యమ్మింపారఁగ, సిద్దమాంబయను సా - ద్వీమాంబకుం బుత్రుఁడై,
యిమ్మై బుచ్చమ ధర్మపత్నిగని సొం - తే, రామకృష్ణాహ్వయున్
సమ్మోదంబునఁ గ్రోవుచున్ జయము వం - శంబున్ హరుం డోముతన్!

3. శ్రీ; పేరకము, సుబ్బరామయ్యసెట్టిగారు. చౌడసముద్రము,
మదనపల్లె తాలూకా.

మ॥ అరయన్, నౌనకులాఖ్యగోత్రజుఁడు; ది - వ్యాత్ముండు; భాగీరథ
మ్మ, రహిన్ రాఘవయార్యుఁడుం గగుణప - మ్మానించు పుత్రుండు; ధీ
వరుఁడౌ వేంకటరామసెట్టికిని సౌ - భ్రాతృండు నౌ, సుబ్బరా
మస్పష్టున్, వర పేరకాన్వయభవున్, - మానాథుఁ డోముం గృపన్!

4. శ్రీ; జయము, రామయ్యసెట్టిగారు, చౌడసముద్రం, మదనపల్లె తా॥

ఉ॥ మాలకులాఖ్యగోత్రజుఁడు; - ముఖ్యుఁడు; వేంకటరామసెట్టికిన్
శీలగుణాఢ్య నెంగమకుఁ - జెల్వగు పుత్రుఁడు; లింగమాంబకున్

బాలనభర్త; శ్రీ జయము - వంశసుధాంబుధి చంద్రుఁడైన, ధీ
శాలుని, రామమూర్తికుని, - సౌఖ్యముగా, రక్షింపుమాం గోముతోన్ !

## 5. శ్రీ; జయము, నారాయణప్పసెట్టిగారు. చౌడసముద్రం, మదనపల్లె తాలూకా.

మ॥ అనయమ్మున్, మూలకులాఖ్యగోత్రజుఁడు; పుణ్యాత్మాదా బుద్ధిమత్సంగుఁడా
వరుఁడౌ శ్రీ నారాయణప్ప సెట్టికిని ని - వ్యక్షత్త పుత్రుండు; సా
దరచిత్తాంగజ రామలక్ష్మమకు హృ - ద్యాంగుండు; నారాయణా
ఖ్యాసజ్జుండు; పరిసిద్ధునా జయముతం - గాంచున్నుడు; మేలొందుతన్ ॥

## 6. శ్రీ; జయము, రామలింగయ్యసెట్టిగారు. చౌడసముద్రము, మదనపల్లె తాలూకా.

మ॥ అనయంగా. జయమున్ శుభాన్వయుఁడు; సా - యానమ్ము హృద్యాగుఁడు; ద
బ్బానవా పుత్రుశీలాధ్యగోత్రి, పసిలా - ప్రాజ్యన్యనామంబునన్
సిరిప్రేమింగను రామలింగయుకు, శ్రీ - సీతమ్మ కిల్లుండు; స
న్నితుంగా, ఘనము, రామలింగయును, సీ - తావాసగోముం బ్రపన్ !

## 7. శ్రీ; జయము, సిద్ధప్పసెట్టిగారు చౌడసముద్రము, మదనపల్లె తా॥

మ॥ స్థిరమా, మూలకులాఖ్యగోత్రజుఁడు; శ్రీ - చిన్నయ్య, లక్ష్మమ్మ, సా
దరమేపారఁగఁ గన్నపుత్రకుఁడు; సి - ద్ధప్పాభిధుఁ; డిట్టి
త్రిరతుండెన్నఁగ, రామలక్ష్మమును బ - త్నింగాఁగొనెన్; సత్యసం
చరుఁడౌ వారిని, భవ్యమౌ జయము వం - శంబున్, హాయిగోముతోన్ !

## 8. శ్రీ; జయము, పాపయ్యసెట్టిగారు. చౌడసముద్రము, (మదనపల్లె తాలూకా)

మ॥ స్ఫుటమౌ మూలకులాఖ్యగోత్రజుఁడు; శ్రీ - సుబ్బయ్య, పాపమ్మ, యు
త్కటనా ప్రేమనుగన్న పుత్రుఁడు; మహో - దారుండు; సచ్ఛీలి, వేం
కటలక్ష్మమ్మ ప్రియుండు; పాపయ బుధా - ఖ్యంగొన్న ధన్యాత్ముఁడై
స్ఫుటముగ్ సౌఖ్యము గాంచుచున్ జయము సం - తంబందు మేలొందుతన్ !

13. శ్రీ; భాస్కర, రామయ్యసెట్టి సోదరులుగారు. పెద్దతిప్పసముద్రం,
(మదనపల్లె తాలూకా)

ఉ॥ శ్రీయుత, భాస్కరాన్వయులు; - శ్రీసెరిసెట్లసుగోత్రజాతులున్,
ధీయుతులైన రామయయు, - దివ్యకృపాకరులైన సూర్యనా
రాయణరామచంద్రులును,- రమ్యగుణుండు గురప్పసెట్టియున్,
శ్రీయును, నాయువున్, శుభము, - జెల్వగుసౌఖ్యము, గాంతురిగావుతన్ !

14. శ్రీ; పబ్బిసెట్టి, వేంకటసుబ్బయ్యసెట్టిగారు. ఓర్వాయిగ్రామము,
(కదిరి తాలూకా.)

ఉ॥ క్ష్మావలయంబునందుఁగనఁ - గన్, మిగునాన్వయగోత్రుఁ, డర్థసం
సేవధి; సిద్ధమాంబపతి; - శ్రీపబిసెట్టిసలుండు; తండ్రి సం
జీవయ, తల్లి కృష్ణమయుఁ, - జెల్వొడ, వేంకటసుబ్బయాఖ్యుఁడై,
పావనుఁడైనవాఁడు; శుభ - వైభవసౌఖ్యము లందుఁగావుతన్ !

15. శ్రీ; రాజా, మల్లయ్యసెట్టిగారు. చెక్కవాండ్రపల్లె, (కదిరి తా॥)

శా॥ శ్రీరాజాకులజుండు; పాపయయు, న - ర్థిన్ మంగమాంబాఖ్యయున్,
గారాబంబునఁ గన్నపుత్రుఁడు; లస - త్కల్యాణి కీర్తిప్రవ్యక్తిం
పారం బ్రాణధవుండు; వెన్నకులగో - త్రోద్భవుండు; మల్లయ్య; వి
ద్యారాజద్విభవార్థ సౌఖ్యములఁ బ్రఖ్యాతింగనుంగావుతన్ !

16. శ్రీ; మామిళ్ల, పుల్లయ్యసెట్టిగారు కరాసుపల్లె, కదిరితాలూకా.

శా॥ శ్రీమూర్తిన్, మిగునాన్వయాఖ్యశుభగో - త్రీయున్, మహోదారునిన్,
మామిళ్లాహ్వయవంశవారధిశశిం - బద్మావతమ్మాప్రియున్,
సామోదుండగు బాలరామయకు, భా - గమ్మాంబకుం బుత్రుఁడై
పేర్మిన్ వర్తిలు పుల్లయార్యునుగుణిన్ - శ్రీరాముఁడెప్డుంగృపన్.

17. శ్రీ; మామిళ్ల, వీరయ్యసెట్టిగారు. కఠారుపల్లె, కదిరితాలూకా.

శా॥ శ్రీ మీరన్, మిగునాన్వయాఖ్యశుభగో - త్రీయుల్, మహోదారులై,
మామిళ్లాన్వయులైన నంజయకును, న్నై - ర్మల్యాత్మసీతాంబకున్,

బ్రేమంగూర్చునుతుండు; సుబ్బమసతీ - హృన్నాథుఁ, డంచత్కళా
భూమానందుఁడు; వీరయాభిధుఁడు; సొం - పుంబెంపుఁ బాటింపుతన్ !

## 18. శ్రీ; పెనుజూరి, రామలింగప్పసెట్టిగారు. వంకరకుంట, కదిరి తా॥

మ॥ ధరన్ బేరొందుతకాలగోత్రజుఁడు స - ద్ధర్మాత్మయౌ వేంకటాం
బ, రహిన్ జిన్నపసెట్టిగన్నసుతుఁడౌ - ప్రఖ్యాతిగణ్యుండు నా
వన మీనాక్షమకాత్మనాథుఁడు, తలం - పన్ రామలింగాహ్వయుం
డిరవౌ శ్రీపెనుజూరి వంశభవుఁడిం - తేసౌఖ్యముం గాంచుతన్ !

## 19. శ్రీ; మూళపాటి, నారెప్పసెట్టిగారు. చిలకలనేర్పు, చింతామణితా॥

శా॥ శ్రీలుండున్, మిగు నాగ్వయాభిదసుగో - త్రీయుండుఁ బెద్దన్నసున్
బాలంగూర్చు మునెమ్మకున్ సుతుఁడు, నెం - చన్, రామలక్ష్మమ్మకున్
సాలోలాత్మవిభుండు, ధన్యుఁడు, సదా - నందేశ్వరస్వామి చిం
తాలీనుండును, మూళపాటికులుఁడౌ - నారెప్ప మేలొందుతన్ !

## పోషకులు.

### గీతమాలిక.

## 1. శ్రీ; సముద్రాల, ఉళ్ళక్కిసెట్టిగారు. ముత్యాలచెరువు, (కదిరి తాలూకా)

తే గీ॥ శ్రీసముద్రాలవంశవా - రిధిశశాంకుఁ
డైన యుళ్ళక్కిసెట్టి; య - ర్ధాంగియైన
లక్ష్మిదేవమ్మతోఁబది - లంబుగాగ
స్వసుఖములనంది ప్రశ - స్తిఁగనుత !

## 2, శ్రీ; పిన్ను, వేంకటశివయ్యసెట్టిగారు. కదిరి, అనంతపురము జిల్లా.

తే॥గీ॥ పిన్నుకుల దుగ్ధవారాశి - విధుఁడు, దివ్య
చరితయౌ కోమలమ్మకు - వరవిభుండు,

వేంకటశివయ్యసెట్టి ధీ - విహితసత్య
ధర్మవర్తన సత్కీర్తిఁ - దనరఁగనుత !

3. శ్రీ; పెదబల్లె, కోదండరామస్వామిగారు. పెదబల్లె, కదిరి తా||

తే||గీ|| ఘనతఁ బెదబల్లె వైశ్యసం - ఘంబుకొల్చు
తత్త్వవేద్యుండు, జానకీ - ధవుఁడు, సత్య
రక్షణుండైన కోదండ - రామమూర్తి,
మత్కృతినిఁ బ్రోచె; స్మరియింతు - మనమునందు ;

4. శ్రీ; సత్రసాల, వేంకటరామయ్యసెట్టిగారు. ఇనగలూరు,
కదిరి తాలూకా.

తే||గీ|| సత్రసాలకులాంబుధి - చంద్రముఁడు,
సిద్దమాంబకుఁ బ్రియసుతుం - డిల్ల వెలయు
ధవుఁడు, వేంకటరామాఖ్య - దాన ఘనుఁడు,
సర్వసుఖములనంది ప్ర - శస్తిఁగనుత !

5. శ్రీ; వంకరకుంట, వైశ్యబృందమువారు. వంకరకుంట,
(కదిరి తాలూకా)

తే||గీ|| సార్వకాలంబు సుఖజయ - సంపదలను
బొంది ముదమందుతను వైశ్య - బృందమెల్ల
వరయ వంకరకుంటయన్ - బురమునందు,
ననుచు శ్రీరామచంద్రుండు - మనుచుఁగాత !

6. శ్రీ; కొమ్మిసెట్టి, అక్కులప్పసెట్టిగారు. టి. చదుము,
(మదనపల్లె తాలూకా)

తే||గీ|| సద్గుణుఁడు, కొమ్మిసెట్టి వం - శప్రసిద్ధుఁ,
డమలహృదిగ్రైన లక్ష్మిదే - వమ్మధవుఁడు,
హర్షయుతుఁ, డక్కులప్పసె - ట్ట్యాహ్వయుండు,
సర్వసుఖభాగ్యజయముల - జగతిఁగనుత !

## సహాయకులు.

1. శ్రీ; M. S. చెన్నకేశవులుసెట్టిగారు. కదిరి, అనంతపురంజిల్లా.
2. శ్రీ; కరే, నాగప్పసెట్టిగారు. కదిరి, ,,
3. శ్రీ; వంకదారి, క్రిష్టప్పసెట్టిగారు. కొక్కంటి, ,,
4. శ్రీ; సకలా, రామయ్యసెట్టిగారు. పెడబల్లె, ,,
5 శ్రీ; రెడ్డపల్లె, సిద్దప్పసెట్టిగారు. నంబులపూలికుంట, ,,
6. శ్రీ; తాయి, తిమ్మయ్య కొమారుఁడు నారాయణప్పసెట్టిగారు. మలమీఁదిపల్లె, అనంతపురముజిల్లా.
7. శ్రీ; సకలా, వెంకప్పసెట్టిగారు. బాలసముద్రము, ,,

---

## పీఠిక.

ఆంధ్రవాఙ్మయమునఁ బ్రకృత మాదరణీయములు నాటకములు. అందుఁ గొందఱుఁ పురాణగాథలను, మఱికొందఱు దేశచరిత్రములను, దృశ్యప్రబంధములుగా రచించిరి. అట్టి దేశచరిత్రములలోఁ జేరినదే యీ వాసవీవిలాస నాటకము. ఈయది ప్రాచీన కన్యకాపురాణములందలి లోపములఁ జాలవఱకు సవరించుచు నవ్యదృష్టి విలసితమై రసికుల కాదరణపాత్రమగుచున్నది. అట్టి యీ రూపకము నాంధ్రలోకమునకుఁ బరిచితమగునట్లు చేయఁగోరిన యీ బాలకవిసింహుని (విద్వాన్, సోంపల్లె-కృష్ణమూర్తికవి అష్టావధాని) యభిలాషమును దీర్చుట మాకెంతయు సంతోషదాయకము. ఈ బాలకవి సహజపాండిత్యముగలవాఁడు; ఈతనికి జ్యోతిష్యము, శాస్త్రము, సాహిత్యము, కవిత్వము—సహజముగా నలవడినవే. కాని దీర్ఘకాల గురుకుల వాస గోష్ఠిచేఁ జేకూరినవి కావు. ఈతఁడు విద్వాన్ పరీక్షయందుత్తీర్ణుఁడై చిత్తూరు మున్నగు ముఖ్యపట్టణములలో వివిధావధానములొనరించి యున్నతోద్యోగులచే సువర్ణపతకముల బహుమతి నందినవాఁడు. మఱియు నీతఁడనేకాంధ్రగ్రంథముల ప్రాశస్త్యమును స్వయముగ గుర్తించివానినన్నిఁటినిఁ దన యనుభవములో సమ్మేళనముఁ జేసికొని యట్లు సమన్వయమునందిన తన యభిప్రాయము నిందుఁ బొందుపఱచియున్నాఁడు. తాత్కాలికానంద ప్రదాయకములగు కొన్ని గ్రంథములు కొందఱికిఁ బహుమాదర పాత్రములగుచుండును. ఆ యా గ్రంథముల శాశ్వతత్వమును భావికాలమే నిర్ణయింపఁగలదు;

## —♦ కన్యకాపురాణములు. ♦—

ఈ పవిత్రచరిత్రమును సంస్కృతాంధ్ర భాషలలోఁ గవిసార్వభౌములెందఱో వ్రాసియున్నారలు. "రససిద్ధాః కవీశ్వరాః" అనుటయు, "కవతే సర్వం జానాతి, సర్వం వరయతి, సర్వం సర్వతో గచ్ఛతీతి కవిః" అని శబ్దకల్పద్రుమకర్త నిర్వచించిన రీతియు, "ప్రకృతిక్కు భాషాప్రణేతల్ కవుల్" అనునానుడియు, నీకన్యకాంబికా చరిత్రమును నానావిధముల రచించిన కవులయందొప్పుకొనక తప్పదు. మేమీ పీఠికను వ్రాయుటకుఁ బూర్వమే కన్యకాపురాణముల విమర్శించుచుంటిమి. అందందనేక విషయములు తెలిసినను వానినిచట వ్రాయఁజాలమైతిమి. మేమిపుడు చూచిన పొత్తములు. (1) బ్రహ్మాండపురాణము – ఉత్తరభాగము – సాలంకాయన వైశ్యముని సంవాదరూపక కన్యకాపురాణము సంస్కృతము ౯ అధ్యాయములు. (2) కన్యకా పురాణము, సటీక — ప్రొద్దుటూరివారిది, (3) వైశ్యపురాణము — పెనుగొండ భాస్కరాచార్యులు. పద్యము ౮ ఆశ్వా. (4) కన్యకాపురాణము—నేలటూరి వేంకటసుబ్బాశాస్త్రి వచనము. (5) కన్యకాపురాణము ద్విపద. (6) సటీకా– వాసవీవిలాసము—పాలపాటి — సుబ్బ చిదంబరరాయకవి. పద్యము. మఱియుఁ గొన్నిటిని విమర్శించితిమికాని, వానిలోఁ గవికొక్కరితిగాఁ గథను మార్చిరి. కన్యకాంబికాచరిత్రము ధర్మార్థ కామ మోక్ష చతుర్విధ ఫలపురుషార్థసిద్ధిఁ గలుగఁ జేయునది. ఆర్యవైశ్యజనుల గోత్రసూత్రపదాచారముల నిర్ణయించు ధర్మశాస్త్రము, దేవీమహిమాను వర్ణనములకు నిధానము, వైశ్యవీరుల ప్రబలప్రతాపానల జ్వాలలకుఁ బాణిఁధమము. ఇట్టి పరమపవిత్ర చరిత్రమును ప్రాచీనకాలమున వైశ్యజన సమాదరణముచేఁ గవిపుంగవులు, పల్లెలలోఁ జెప్పుచున్న కథలను వినియో? మఱియే యాధారములఁ గొనియో? వివిధవాఙ్మయములలో విశదీకరించిరి. కాని, కథా భాగములేకరీతిగా నుండక మతములు వేఱు–పుట్టుకలు వేఱు–ప్రవర్తనములు వేఱు– వంశములు వేఱగునట్లు కనుపట్టుట చింత్యము.

## —♦ విష్ణువర్ధనుఁడెవఁడు? ♦—

ఈ విష్ణువర్ధనుఁడే కాలమునఁ జాళుక్యరాజులలో నుండిన యెన్నవ పురుషుఁడో? కాని, వాసవీకన్యాచరిత్రమున కెక్కుటచేఁ జరిత్రకారులకు సందేహమును గలిగించి నాఁడు. ఇట్లే యీపురాణమునందలి పాత్రములన్నియు విచారింపఁదగియుండినను

వానిని దడవుట మతాభిమానులకు విడచి విష్ణువర్ధనుని గుఱించి మాత్రమిచటఁ గొంత చర్చించెదము.

శ్లో॥ అస్తిరాజమహేంద్రాఖ్య నగరం లోకవిశ్రుతం ।
మార్కండేయేశ్వరావాసం గోదాజల పవిత్రితం ।
తత్రపాండుకులేజాత శ్చాళుక్య కులశేఖరః ।
చంద్రాన్వయోద్భవో రాజా విష్ణువర్ధన నామకః ।
రావణాంశోద్భవో రాజా, శివపూజారత స్తథా ।
శైవాగమవిశేషజ్ఞో విష్ణుధర్మ విరోధికృత్ ।
కోటిలింగానిసంస్థాప్య గోదాతీరేషునిర్మలే ।
విష్ణోశ్చిచ్ఛేద పూజార్థాః ప్రతిమా నిశితాయుధైః ।
సుప్రహోంశ్చ హరేరాజా విష్ణుస్థల విదారకః ।
తతో జనైస్సగదితో విష్ణువర్ధన నామభిః ।
వర్ధనం ఛేదనం ప్రోక్తం యథాతేశ్మశ్రు వర్ధకాః ।
ఖండితా వర్ధితస్తా, తథాసౌ విష్ణువర్ధనః ॥

బ్రహ్మాండ-స్వకా-4 అధ్యా.

"పాండ్యస్య సప్తమః పౌత్రశ్చాళుక్య కుల శేఖరః" పటీ-వాస-4 అ.

"రాజరాజనరేంద్ర రాజునకును, సర్వలక్షణయగు శర్వాణీదేవికి వంశవర్ధన విష్ణువర్ధనుండు;" అని. వైశ్యపు. 5 అ. 5 పద్య.

"రాజరాజనరేంద్రుండు దనతండ్రికి సంస్కారాదిక్రియలఁజేసి, దండయాత్ర వెడలుటకు" నేల-వేం-శాస్త్రి, వీరందఱిట్లు వ్రాయుటచేతనే కాఁబోలు ? బ్ర॥ పాలపాటిసరసచిదంబరరాయకవి సటీకా వాసవీవిలాసములో నిట్లు వ్రాసికొనెను. "పీఠిక-ఈవిషయమునందు నేను నిజము గనుఁగొనుటకై తెన్నగా విచారించి సిద్ధాంతీకరించితిని. రాజరాజనరేంద్రునకే విష్ణువర్ధనుండని మఱియొక పేరుగలదు. ఇతని తండ్రి విమలాదిత్యుఁడు, ఇతని భార్యలు గత్నాంగి-చిత్రాంగి-ఇతని కుమారుఁడు సారంగధరుఁడు సిద్ధులలోఁ గలిసెను. ఇతని రెండవకుమారుఁడు సిద్ధి. ఇతని రాజధాని రాజమహేంద్ర నగరము. ఇతని యాస్థానకవి నన్నయభట్టు" అనియును, "రాజరాజనరేంద్ర రాజితాంకమునకు రాజశేఖర కరగ్రహముఁజూపె" వరగుణుండగు శ్రీవిష్ణువర్ధనుండు, 'నన్నయన్నథకుఁ బిలిపించి, అతఁడు శ్రీమహాభారత మాదిమొదలు, పదియునెన్మిది పర్వముల్ప్రతిథమెఱయఁ జెప్పఁగా విని,' "బాగుగ దీని నాంధ్రముసఁబల్క సమర్థుఁడ

యేండ్లకన్న నెక్కువవయస్సుండదు. రాజమహేంద్రవరమునందుండి నలుబదియొక్క సంవత్సరము రాజ్యమేలిన మొదటి చాళుక్యప్రభువీతఁడే. ఈ రాజనరేంద్రుండు పరమ సుఁడును, గావ్యగీతి ప్రియుఁడునగుటచేతనే యీతని కొలువుకూట మెప్పుడు బహుభాషాపండితులచే నలంకరింపఁబడుచుండెను. ఒకానొకనాఁడు రాజరాజ విష్ణువర్ధనుఁడు విద్వాంసులచేఁ బరివేష్టింపఁబడి నిండుకొలువున్న కాలమున నన్నయభట్టులోఁ "భూదేవకులాభిజాత్యము మహాయుఃప్రీతియుఁ, బారతశ్రవణాసక్తియుఁ, బార్వతీపతిపదాబ్జధ్యానపూజా మహోత్సవముఁ, సంతతదానశీలతయు, సత్యాస్థ సాంగత్యముఁ" నామదిఁ బాయవని చెప్పెను. నన్నయ, నారాయణ, మల్లనాది కవుల కగ్రహారములొసఁగియు యుభయభాషాపోషణము సేసిన ధర్మప్రభువగు నితఁడు మర్యాదనుజ్జగించి వాసవీకన్యను బలాత్కరించి తలపగిలి చచ్చెనా? చిత్రాంగి సారంగధరుల కథయే నిజమని మనమొప్పుకొనినను, దేశచరిత్రములఁ బరిశీలించినను, ముసలివాఁడైనంతవఱకు రాజనరేంద్రుఁడు జీవించినట్లు తెలియుచుండఁగా నిఁక వాసవీకన్యను గోరినది ముసలితనమందై యుండవలెను. ఆహా! దేశచరిత్రములఁ జదువని వీరి సిద్ధాంతము. భావికవుల సందేహములకు రాద్ధాంతము గదా? ఇదివఱకే తలయుందోఁకయు లేని చిత్రాంగీ సారంగధరుల కథ నంటఁగట్టిన వారివలెనే, కన్యకాంబాచరిత్రమును ముడిపెట్టి రాజరాజు నిర్మలయశశ్చంద్రికలకుఁ గళంకము నాపాదించిరి. భాస్కరాచార్యులు వ్రాసిన వైశ్యపురాణమున రాజనరేంద్రుని తండ్రియైన విమలాదిత్య విష్ణువర్ధనుఁడే వాసవీకన్యను బట్టుకొని తలపగిలి చచ్చినట్లుండుటచే నీకవి తననాటకమునఁగూడ నట్లెవ్రాసెను.

## —♦ వాసవీకన్య. ♦—

వాసవీకన్య లక్ష్మియా? పార్వతియా? స్వయంభువా? యను విషయమును జర్చింపఁదలఁచిన నెంతయేని యాధారమున్నది. ఐనను, గొలఁదిగా నిందుదాహరించెదము.

శ్లో॥ దదర్శ తులసీమూలే తత్ర జాతాం బాలికాం।
పరిగృహ్యాసు తాం బాలాం విస్మితా వైశ్యసుందరీ।
బాల్యాదేవ విష్ణునామాని వదంతీ, విష్ణుదర్శనే।
సముత్సుకా చ తన్వంగీ హరేరేవ నివేదనం॥ అని యొకటి,

"పీయతాం తవభార్యాయై కల్పవృక్ష ఫలద్వయం।
పుత్రం పుత్రీం లభస్వేతి గత్వా గౌరీతి రాదథే॥ వా 3 అ. 38 శ్లో॥

ఇందుఁ గొందఱు తులసీబృందావనమున లక్ష్మీదేవి యనుగ్రహమునఁ గన్యకాంబ స్వయముగాఁబుట్టి కుసుమశ్రేష్ఠికి దొరకినదనిరి. వేఱొకరు గౌరీదేవి కల్పవృక్షఫలములు

రెండుదెచ్చి పెట్టికీయఁగా నవి వైశ్యస్త్రీ భక్షింప వానిచేఁ బుత్త్రుఁడు-పుత్త్రిక-పొడమిరనిరి. మరియొకచో వింధ్యవాసినీ దివ్యానుగ్రహమునఁ గుసుమసెట్టిసేయు హోమము నుండి యజ్ఞపురుషుఁడు పాయసముదెచ్చి యీయఁగా దానిచే వాసవకన్య జనించినదని యున్నది. వైష్ణవకవులు కుసుమసెట్టి వైష్ణవమతస్థుఁడనిరి. విష్ణువర్ధనుఁడు శైవుఁడనిరి. శైవకవులు కుసుమసెట్టి శైవుఁడు గావుననే పార్వతియే కన్యకగాఁ బొడమినదనిరి. ఈకవిగూడ దానినట్లేవ్రాసెను.

## —♦ వాసవీవిలాసము. ♦—

దీనియందు విలాసములేమి యున్నవి? దీనికీపేరు చెల్లునా? యని మావారు గొందఱడిగిరి. ఇది వీరరసప్రధానమగు నాటకము. కావున దీనికి వాసవీ విజయమని పేరిడిన బాగుండెడిదేమో? కాని, మాశిష్యుని యూహయేమనఁగా? ఈ కథయంతయు దేవీ లీలావతారము. కైలాసమున శంభుశక్తితోఁ బార్వతి చెప్పిన మాటలు, యగ్నికుండముల దుముకు వైశ్యవీరులతోఁ బరమేశ్వరి యొసఁగిన వైరాగ్యాదికధనము, సూక్ష్మదృష్టితో విలోకించిన నీవిలాసమునను దేవీలీలని యర్థముఁ జేసికొనఁదగును. అందువలన, వాసవీవిలాసమనుపేరు పొసఁగును. ఇందు శృంగారమునకు రసాభాసము సిద్ధించినది. స్త్రీ పురుషులలో నొకరికిఁ బ్రీతిలేక యొకరికుండుట రసాభాసము. ఇది మూలకథావిశేషము. ఇఁక వీరరసమనిననో? చక్కఁగాఁ బ్రతియంకమున నొప్పుచున్నది. శాంతాద్భుత కరుణా హాస్యరసములు పొంగిమాలుగానున్నవి. వీరరసప్రధానముగా నాటకము వ్రాయఁదలఁచియే, కవి ప్రథమాంకమున నటిచే "అన్యపుత్త్రికా క్రోశము క్షణకాలములో వృద్ధియయ్యెనే?" యనిపించి దుర్వాసునిఁ బ్రవేశపెట్టినాఁడు; ఋతుగానమైచ్ఛికమగుటచే వసంతర్తుప్రసంగము కూర్చినాఁడు. మఱియు, దుర్వాసోముని శాపారంభ బీజసంబంధముగల ముఖసంధితోఁ గథ మొదలిడఁబడినది. రెండవయంకమున-నీచపాత్త్రప్రవేశకములో గసికులఁ గడుపుబ్బ నవ్వించినాఁడు కవి. మృగవ్యాధునకు, మునులకు, జరిగిన సంభాషణము సమయోచితముగానున్నది. అందందు నటకుల సౌకర్యమునకై కవిచూపిన రంగోచిత వస్తుప్రదర్శన మాధునిక నాటకసాంప్రదాయముగానున్నను, జదువరులకు సుగమము. ప్రాచీనలక్షణములకు, సమ్మతము. ఇందు నాటకలక్షణములు:-అంకలక్షణము-ప్రస్తావన-విష్కంభ ప్రవేశక-చూలిక-అంకముఖ-అంకావతారములు. సంక్షిప్తముగాఁ జూపఁబడినవి. బీజ-బిందు-పతాకా-ప్రకరీ-కార్యములు. అయిదర్థప్రకృతులు-ఆరంభయత్నప్రాప్త్యాశానియతాప్తిఫలాగమములు-కొంతవఱకు సమకూర్పఁబడినవి. ఇఁకను నిందే

యేసుగుణములున్నను గ్రహించి, దోషములున్న నిరసించి, మాశిష్యుని బహుగ్రంథకర్త గాను, వివిధావధాన విశారదునిగాను నాశీర్వదింపఁ బండితమండలిని వేఁడుచున్నారము. నియమవంతిమగు నీరూపకమును పాఠశాలలలోఁ బఠనీయగ్రంథముగా నిర్ణయింప, విద్యాశాఖాధికారులాదరమును జూపఁగోరుచున్నారము.

ఇట్లు,
అభినవబాణకవి-ఆశుకవిచక్రవర్తి-కవిసార్వభౌమ,
**విద్వాన్ గౌరానర్సుల రామకృష్ణ సీతారామ సోదరకవులు.**
శతావధానులు. గిజ్జలకొండ,
మార్కాపురము తాలూకా, కర్నూలుజిల్లా.

---

# పండితాభిప్రాయములు.

సీ॥ స్ఫురియించె నొకచోట - వరధర్మకామార్థ
మోక్షమార్గంబుల - మోహముగను;
నివసించె నొకచోట - నిర్మలగంగాత
రంగసంఘట్టనా - పరిచరవముఁ;
కురియించె నొకచోటఁ - గోమలతరసుధా
సారంపు జల్లులు - సరసముగను;
హరియించె నొకచోట - నప్సరః కుచకుంభ
యుగళీ సమాననా - బిగితనంబు;
తే॥గీ॥ అనుచు, సొంపల్లె కృష్ణమూ - ర్త్యలఘుదివ్య
కావ్యరచనా విశేష వా - క్పటిమ, నఖిల
సుకవిసంతతి హర్షించి - స్తుతియొనర్ప,
జగతి నాచంద్రతారార్క - మగునుగాత!

అభినవనన్నయభట్టారక;
**రాళ్లభండి–నరసింహశాస్త్రి.**
ఎఱ్ఱగొండపాలెము. (కర్నూలుజిల్లా.)

ఆర్యా,

గీ॥ బాలకవిసింహముఖబిరు - దాళిఁ గాంచి
తనరుసొంపలరుకృష్ణవి - ద్వద్వరేణ్య !
వేడ్కఁ గంటి భవద్వాస - వీవిలాస
మహితనాటకమణిని స - మగ్రముగను.

క॥ మృదుమధురరసాస్పద పద
సదలంకారగుణ భావ - శయ్యాదిమహా
స్పద మగుమీకృతి సహృదయ
హృదయాహృతిఁ గాంచి యొలమి - నెసఁగుచు నిమ్ముఁగా.

ఇట్లు, మిత్రుఁడు,
గంజిగుంట, శ్రీనివాసయ్య,
తెలుఁగు పండితుఁడు,
బోర్డు హైస్కూలు, మదనపల్లె.

16—1—37
రామసముద్రము.

శ్రీ

కావ్యస్మృతితీర్థ-అభినవాంధ్రవాల్మీకి-ఆంధ్రవ్యాస,
జనమంచి, శేషాద్రిశర్మగారి యభిప్రాయము.

మహాశయా !

తమరాదృతిమెయి ననిపిన వాసవీవిలాసమను నాటకమందినది. పరమానందమున నందందుఁ బఠించితిని. విద్యాపరీక్షయందాఱితేఱి, భక్తరక్షామణి శతకము, ఆపదుద్ధారక స్తవము నాంధ్రీకరణము గావించి, ప్రబంధకల్పనల నొనరించి మించి, యష్టావధానమున విఖ్యాతిగడించి, పండితుల మెప్పుఁబడసిన మీయీనాటకరచన సరస జనగేయము గాకుండునా ? అందందుఁ బొందుపఱచిన పద్యములు కడుంగడు హృద్యములు. నాటకము స్తోత్రపాత్రము. అధునాతనుల మతమున ననుసరింపక, ప్రాచీనుల పోకడల ననుసరించి వ్రాయుటయే, మీకుఁగల భాషాభిమానమును వెల్లడించును. ధారాశుద్ధిగలిగి మీకవిత్వమత్యంత హృద్యమై యలరారుచున్నది. రాయలసీమను మీరు

సద్యశస్సును సంపాదించి యొసంగితిరి. ఇంక నిట్టిగ్రంథములం బెక్కింటిని వ్రాసి యశశ్చంద్రికలదెసల నెసలారఁ జేయుదురుగాక యని, వారిఁ గోరుచున్నాఁడను. మీ యీ, సుకృతి యాంధ్రదేశమున నెల్లయెడల వ్యాపించుఁగాత మని యర్థించుచున్నాఁడను. చిత్తగింపవలయును.

ఇట్లు-విధేయుఁడు,
జనమంచి, శేషాద్రిశర్మ.

శ్రీరామాయనమః

క॥ విలస న్మృదుమధురపదం
బులచే నలరారి కృష్ణమూర్తి రచితమం
జుల వాసవీవిలాసా
ఖ్యల సన్నాటకముఁ జూడఁ గడుముద మొదవెన్ ॥

ఉ॥ భావమనోహరంబు కథ పండితపామరరంజనంబు ని
ర్దోషము లర్థకల్పన లతుల్యము భావసమృద్ధి కంతువి
ద్వేషి జటాపటత్సురనదీసదృశంబు కవిత్వధార సం
తోషము నొందకుందురె! బుధుల్గని యీనవదృశ్యకావ్యమున్ ॥

క॥ ఈ వాసవీవిలాస ను
భావహ కావ్యమ్ము సహృదయాహ్లాదకరం
బై వెలయు నెప్పుడు దేవీ
పావనకారుణ్యమునకుఁ బాత్రంబగుచున్ ॥

గానిపల్లె,
శ్రీనివాసపురము తా॥
కోలారు జిల్లా.
5—3—'37.

ఇట్లు
సుజనవిధేయుఁడు,
గుమ్మరాజు రామకవి.

శ్రీరస్తు

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# గురుస్తుతి.



సీ॥ కవిసార్వభౌమాఖ్య ♦ కవిచక్రవర్త్యభి
నవబాణకవియను ♦ నామములను
సుప్రసిద్ధిగనొంది ♦ సూరిసన్నుతముగా
నష్టశతావధా ♦ నాళిఁజల్పి
శిష్యవాత్సల్యంబు ♦ చెల్వొందఁబోషించి
యెందఱనో? విద్య ♦ నందఁజేసి
మామకకీర్తి స ♦ న్మానముల్ పెంపొంద
హర్షించి యాశీస్స ♦ హస్రమొసఁగి

తే॥గీ॥ గౌరవర్షుల వంశవి ♦ ఖ్యాతిఁగనిన
యనఘులౌ రామకృష్ణక ♦ వ్యగ్రజులను
సరసులైన సీతారామ ♦ శాస్త్రిగారి
నిరువురను నాదు గురువుల ♦ నెంతు నెపుడు.

విద్వాన్, బాలకవిసింహ, అష్టావధాని.
సోంపల్లె, కృష్ణమూర్తి.
కొక్కంటి, కదిరి తాలూకా.
అనంతపురముజిల్లా.

శ్రీరస్తు

# విజ్ఞప్తి.

---

పండితమహాశయులారా!

ఈ వాసవీవిలాస నామకరూపకరచనమునకు మొదటి కారణము హితాభిలాష. ఏతచ్చరిత్రాంశము లెందుఁగొనినను, నభిప్రాయభేదములై సంశయాస్పదములై యుండుట తద్జ్ఞులకు విదితము. శక్తికొలంది వానిని సమంజసములుగాఁ జేయఁగోరుట రెండవ కారణము. సాధారణముగ నిత్యప్రాచ్యప్రకటితములై యుండు గ్రంథములనెల్ల నేతి ప్రసంగమునకై పరికించితిని. ఉచితపరిగ్రహంబును, ననుచితపరిత్యాగంబును గావించి విషయము నాకళించి, రచనకుఁ గడంగితిని. నా యీ ప్రయత్నమునకుఁ బ్రీతిని బ్రసాదించిన యస్మద్గురువర్యులును, నాప్తులై గ్రంథముఁ జదివి యభిప్రాయములొసఁగిన విద్వాంసులును, ముద్రణస్ఖాలిత్యము లెప్పటికప్పుడు శ్రద్ధతో సవరించి, మిగుల సహాయమొనర్చిన బ్రహ్మశ్రీ మదనపల్లి బోర్డు హైస్కూలు తెలుఁగుపండితులు, గంజికుంట, శ్రీనివాసయ్యగారును, నిత్యస్మరణీయులు. గుణదోషపరామర్శము విమర్శకాగ్రేసరులది. నా యీ యాకలంబులగు ప్రాజ్ఞవరుల కెల్లఁ గృతజ్ఞతాపూర్వకవందనములు సమర్పించితి.

ఇట్లు,

గ్రంథకర్త.

# ఈ నాటకమున వచ్చెడి పాత్రములు.

## పురుషులు.

1. సూత్రధారుఁడు
2. విష్ణువు
3. జయవిజయులు
4. ధనంజయుఁడు
5. సమాధి (శంభు శ్రేష్ఠి) (సుగంధి శ్రేష్ఠి)
6. దుర్వాసుఁడు
7. వర్తకులు. (వైశ్యశ్రేష్ఠులు) { నాగిశిష్టుఁడు, సోమశిష్టుఁడు, మల్లిశిష్టుఁడు, గుణశిష్టుఁడు }
8. అపరార్కుఁడు
9. మృగవ్యాఘ్రుఁడు (మల్లుఁడు)
10. తేశేశ్వరుఁడు
11. సుజేతుఁడు
12. చిత్రకలసుఁడు (విష్ణువర్ధనుఁడు)
13. నారదుఁడు
14. విజయసింహుఁడు
15. కుమారకంఠీరవుఁడు
16. రాజరాజేంద్రుఁడు
17. సేవకులు
18. బాలనాగరులు
19. ధనదుఁడు
20. భాస్కరాచార్యులు
21. విరూపాక్షుఁడు
22. ధాత్రి

## స్త్రీలు.

1. నటి
2. సుశీల
3. మాలిని
4. కమల
5. పార్వతి (వాసవి)
6. కుసుమాంబ
7. సువాసినులు



శ్రీరస్తు.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః.

# వాసవీ విలాసము

## ప్రథమాంకము.

నాంది.

సిరియుం, బల్కులరాణి, సామిసగమేన్-జేకొన్నయిల్లా, లటం
చరుడా పేరులఁబిల్చి, మ్రొక్కులిడు భ-క్తాళిన్ దయంగాంచి; జ
న్మరహస్యంబు తెలుంగఁజేసి; పర సా-మ్రాజ్యంబుఁబాలించి; దు
ష్టరులన్ రూపుమాపు, దేవి; మనలన్-సద్భావయై ప్రోవుతన్ ॥

ప్రస్తావన.

ప్రవేశము; సూత్రధారుడు.

సూత్ర—(పద్యముఁ జిలకించి) నేఁడుకదా! నాజన్మము సఫలమైనది.

తే॥గీ॥ బ్రహ్మతేజోనిధానులౌ - బ్రాహ్మణులును,
సహజగంభీరభావులౌ - క్ష్మాపతులును,
స్వకులధర్మానుసారులౌ - సర్వజనులుఁ,
గన్నులకుఁ బండువుగ నిందుఁ - గానఁబడిరి; ॥

సభాస్తారుల, నవలోకించినంత, నాయుత్సాహము ముప్పిరిగొనుచున్నది.

తే॥గీ॥ అల, వసంతునిరాకకు - నలరి వృక్ష
జాలములు పల్లవించిన - పగిదిఁ, గ్రొత్త
నాటకంబుఁ బ్రదర్శింప - నవ్య సభ్య
హృదయములు పల్లవించు, స - మ్మదము గదుర; ॥

(నేపథ్యమువంకఁజూచి) ప్రేయసీ! ప్రేయసీ!

ప్రవేశము ; నటి.

నటి—ఆర్యపుత్రా! ఇంతత్వరితముగఁ బిలువనేల ?

సూత్ర—సభాసదుల కాహ్లాద మొదవింపఁగల, రూపకమేదేనిఁ, బ్రదర్శింపఁజేయుట, యుచితమని నిన్నుఁ బిలిచితిని.

నటి—అట్టిరూపక మెద్దికలదు? దయాళువగు పండితుల కెద్దియైన, నాహ్లాదకర మగునా?

సూత్ర—పండితులకే కాదు; పండితపామరుల కెల్లరకును, ముద మొదవించునది శ్రీరూపకమే.

నటి—ఆర్యా! ప్రకృతిపురుషతారతమ్య మిపుడు నాకుఁదెలియదు; కాని, యారూపక మేదికోరా? నిక్కముగ వచింపుఁడు.

సూత్ర—ప్రియురాలా! నేనసత్యమాడుదునా? దేవీ విలాసములందు సుప్రసిద్ధి వహించిన "వాసవీవిలాస" మను నాటకముఁ బ్రదర్శింతమనియే, నాయూహ.

నటి—క్రొత్తవార్త తెలియఁగఁజేసితిరి. అంతటి సుప్రసిద్ధనాటకము రచించిన, కవిగా రెవరు? ఇంకను నేమైన గ్రంథములను రచించిరా? తెలియఁజేసి, శ్రవణానంద మొనగూర్ప వేడెద.

సూత్ర—చిరపరిచితుఁడగు కవీశ్వరు నీవెఱుంగవా? వినుము.

సీ॥ ఇరువదియేండ్లకే - హృద్యతరంబైన
అష్టావధాని పే - రందినాఁడు;
భక్తరక్షామణీ - పద్యశతము వ్రాసి
పండిత దీవనల్ - వడసినాఁడు;
వర, బాలకవిసింహ - బిరుదంబు విద్వాంసు
లెంతయు నిడఁగ, - గ్రహించినాఁడు;

బంగారు పతకంబు - లం, గౌరవమొసంగఁ
బూనిక సభలలోఁ - బొందినాఁడు;

తే॥గీ॥ రీతిఁదప్పక విద్యార్థి - రీక్షయందు
నంచితంబుగ నుత్తీర్ణుఁ - డైనవాఁడు;
ఆపదుద్ధారకస్తోత్ర - మాదిభాష
నుండి తెలుఁగించినాఁడు; ఘ - నుండతండు; ॥

మఱియు,

తే॥గీ॥ దివ్యమైనట్టి శ్రీసతీ - తిలక యనెడి
నవల రచియించి మించెఁ, బ్రా - భవమొసంగ
నా, సుహృత్కల్పవల్లిని - నలరఁజేసి
కీర్తిగడియించె; సోంపల్లె - కృష్ణమూర్తి. ॥

నటి—ఆర్యా! నూతన ప్రియత్వము, రాజులకేయందురు కాని, మీమాటలు వినిన
వెంటనే, యీనాటకముపై నాకునుఁ దద్భావ మొదవినది.

సూత్ర—ఇఁక, నాలస్యమునకు సభ్యులోర్వరు. పరికింపుము.

తే॥గీ॥ బ్రహ్మతేజోనిధానులౌ - బ్రాహ్మణులును,
సహజ గంభీరభావులౌ - క్షత్రపతులును,
స్వకులధర్మానుసారులౌ - సర్వజనులుఁ,
గన్నులకుఁ బండువుగ నిందుఁ - గానఁబడిరి. ॥

నటి—ఆర్యపుత్రా! మీరు కోపపడనిచో, నేనొకమాట నుడివెద.

సూత్ర—కానిమ్ము. అంగీకారమున కనుకూలమైన, సంతసించెదను.

నటి—

తే॥గీ॥ రత్నమొండున్న నచ్చోట - రత్నాలు మెండు;
సజ్జనుండొక్కఁడున్న దు - ర్జనులు మెండు;

రసికుఁడొకఁడున్నఁ బరిహాస - రతులు మెండు;
: మానసికవృత్తి యపుడప్డె - మారుచుండు; ॥

కాలమునుబట్టి యిదియేనిక్కఁగుని పెల్లుబుకరాదు.

సూత్ర—ఛీ! మదాంధురాలా! సుగుణపుంజమున, దుర్గుణలేశమును గమనించి, పెంచెద వేల? ఇంతటి సభను నీ ప్రతికూలభాషణము కార్కశ్యమును గలిగింపదా?

నటి—ఆర్యా! కాలగతి ననుసరించి, నిజమునే పలికితిని.

సూత్ర—నిజమేయైన, నుదాసీన స్వభావపూరితముగ మాటలాడుటను సాహసింప నగునా? ఇట్టివి గౌరవహానిప్రదములు.

నటి—(చిఱునగవున) ఆర్యపుత్రుల కారోశము క్షణకాలములో వృద్ధియయ్యెనే! క్షమింపుఁడు. దుర్వాసోముని స్వభావమును మీహృదయమునుండి తొలఁగింపుఁడు. (ప్రియుని చేతులు పట్టుకొనును)

(తెరలో)

ఆ. ఎవరకఁడు? దుస్స్వభావమునను నన్నుపమానమొనర్చుచున్న క్రూర మతి; విష్ణుసాన్నిధ్యమున కేగుచున్న నాకీమార్గమధ్యమునఁ, దిరస్కారపూర్వక వచనము ననుసంధింతురా?

నటి—ఆర్యా! ఇఁకేమిగతి? ఎవరిదా గంభీరభాషణము?

సూత్ర—(ఆకసము వంకఁజూచి) దుర్వాసోముని యిదే, యేతెంచుచున్నాఁడు. మన మిటనుండిన, ముప్పునగూడును. రమ్ము.

(ఇరువురు, నిష్క్రమింతురు)

తెర లేచును.

[వైకుంఠమున, శేషశాయియై విష్ణువుండును. జయవిజయు లిరుపార్శ్వముల నుందురు. ధనంజయుఁడును, సమాధియు, మఱికొందఱు మునులును, నచ్చోఁ జేతులు మొగిడ్చి, కూర్చొనియుందురు.]

ప్ర ; దుర్వాసోముని.

శా॥ శ్రీలక్ష్మీహృదయాధినాయక! కృపా - సింధూ! మహాపాపజం
బాలంబుం గడ తేర్చి, దుర్గుణములన్ - భంజించి, కామాదులన్

లీలంగూల్చి, త్వదీయతత్త్వమును నా - లింపంగబోధించి, మా
యాలోలాత్ములఁ, బ్రోవవేడెదను; దే - వా! మానిచింతామణీ!

(మునులెల్లరును లేచి, దుర్వాసునాహ్వానించి, నారాయణున కభిముఖులై, దుర్వాసునితోఁగూడ నిల్చి)

— దండకము. —

శ్రీచిత్స్వరూపప్రభావానుసారాత్మలేదివ్యకాంతిం దగన్ నాసికాగ్రంబునం జూచి, సానంద సామీప్య సారూప్య చిహ్నంబులం బూనఁగా నేర్తు? రే దివ్యనామంబులన్ నిశ్చలంబైన హృత్ప్రీతినిన్ వ్రాసి, నూరాఱుమార్లుం బఠింపంగ నూహింతు? రే నిర్మలంబైన పాదాంబుజస్రావమాధుర్యధారామితాస్వాద కౌతూహలాయత్త చిత్తంబులన్, భృంగరాజంబులట్లాసుధం గ్రోలి, మత్తిల్లి, నీతత్త్వముం బాడఁగా నెంతు? రేచింతతో, మానసంబెల్ల నీయందె వొప్పించి, యంగంబులెల్లన్ భవత్సేవ సేయంగ నిర్మించి, కర్మానుసారంబుగా వచ్చు జన్మంబులం బాసి, శర్మంబునుం గాంతు? రో దేవదేవా! దయార్ద్ర స్వభావా! యెఱుంగంగ, శక్యంబుగాకుండు మూఢాళికిన్, గాన, మమ్ముద్ధరింపంగ నీవేకదా దిక్కు? మాలోల! లీలావినోదానుశీలా! లసద్భక్తపాలా! నమస్తే; నమస్తే; నమః.

విష్ణు — మునీంద్రులారా! మీ ప్రార్థనమునకు మెచ్చితిని; స్వస్థచిత్తులరై కూర్చుండుఁడు.
(తానును, లేచి కూర్చుండి) లోకవినోదముల నించుక నెఱిఁగింపుఁడు.

మునులు — మహానుభావా! సర్వజ్ఞులకడ, వచింపఁదగిన దేమున్నది?

విష్ణు — లోకవృత్తుల నెఱింగి, ధర్మాధర్మములను విమర్శించి, దుష్ప్రవర్తనులఁ జక్క దిద్దుటకు, మీరును బ్రధానభూతులు కారా?

మునులు — చిత్తము. తోఁచినదాని నెఱిఁగింతుము.

దుర్వా — దేవా! నీ సంకల్పమాత్రమునఁ గల్పింపఁబడిన బ్రహ్మాండము లెన్నియేనుండ, నొక్కరుండెవ్వఁడు వానిరహస్యము లరయఁగలఁడు? సమస్త జీవరాసులును, సృష్టించినను, బోషించినను, దుదకు, లయమొందించినను, నీయాజ్ఞకులోఁబడినవి.

వాని మనోవృత్తులు సర్వాంతర్యామివగు నీకెఱుక. ఱెప్పపాటున నీలోకములన్నియు, గడగడ వడంకఁజేయుదువు. అంతలో, నానందసాగరమున, భూతములనెల్ల నోలలాడింతువు. ధర్మమును బ్రతిష్ఠింతువు. దుర్మార్గుల నిర్మూలింతువు. సృష్ట్యంతమునఁ బునస్సృష్టి నొకక్షణమునఁ జల్పుదువు. అన్నిచోటులనుండియు, నొక్కనికైనఁ గన్పడవు. ఎల్లవిషయములెఱింగియు, నెఱుఁగనివానివలెనుందువు. అట్టి నీయెదుట, మేమేమాత్రము వచింపఁజాలుదుము? అయినను, మీయాజ్ఞ ననుసరించుటకు సిద్ధులము. దయామయా! తొల్లి, నీచే విభాగింపఁబడిన చతుర్వర్ణములవారికిఁ గొందఱ మునీంద్రుల, నధినాయకులఁ గావించితివి. ఆ యావర్ణములవారి వృత్తాంతము, నా మును లెఱిఁగి, నీ సన్నిధి విన్నవించు నట్లేర్పాటొనర్చితివి. అందు, మాలోఁ గల్గియుండు నూటయేఁడు గోత్రములకు సంబంధించిన వార లెల్లరు, సత్యాచార పరాయణులై, స్వధర్మము ననుసరించియున్నారు.

ధనం—జనార్దనా! క్షత్రియాన్వయులగు సప్తగోత్రములవారును స్వకుల ధర్మ మవలంబించి, పరిపాలనా శీలత నున్నవారు.

సమా—మాధవా! ఏఁడునూఱులును బదునాల్గు గోత్రములు గల మా వైశ్యగణము వారు, అసమాన భక్తియుక్తులై, కులధర్మములనువీడక, యండఱివలె డంబములు పల్కక, యనేక పుణ్యకార్యము లొనర్చుచు, స్వర్గలోకముఁ జేరుగాను శక్తి గలిగి, యధిక సంఖ్యాకులై, యితర వర్ణములకన్న మిన్నగ నున్నవారు.
(కొందఱు చిఱునవ్వులు నవ్వుదురు. మఱికొందఱు, పరిహాసకారణముగ, గేలి సేయుదురు.)

దుర్వా—(కోపముతో) ఓరీ! దురాత్మా! ఆత్మశ్లాఘపరాయణా! నీ వచనములు కర్ణకఠోరములుగ నున్నవి. ఇదే, నీ పరివార జనమునకు నయితము గర్వము హెచ్చినది. అధిక సంఖ్యాకులగు మీ గోత్రములవారిలో;

మ॥ ఒకనూటొక్క మఱిరెండు గోత్రముల వా - రొక్కింత సన్మార్గవ
ర్తకులై యుండిరి గాన, వారలకు ని-త్యంబైన సత్కీర్తిని
ప్రకటంబై సుఖమిచ్చు; నాపయిని దు-ర్మార్గుల్ కులభ్రష్టులై,
వికలత్వంబగు బుద్ధిచేఁ జెడుదురు-ర్విన్; నాదు శాపోక్తులన్॥

ధనం—మునీంద్రా! శాంతింపుము. శాంతింపుము. (సమాధి నుద్దేశించి) సమాధీ!

తారతమ్యము నెఱుంగక, యాత్మగౌరవము వెల్లడింపఁ జూచుటయే, యింతకుఁ గారణము. ఐనను, విధివిధాన మీరీతినున్నది కాఁబోలును.

విష్ణు—మౌనులారా! స్వకులాభిమానమున విజ్ఞులీగుట, సజ్జన లక్షణమా? సమస్తభూతములు నాదరణీయములే; జ్ఞానదృష్టినిఁ దిలకింపుఁడు. పామరత్వము పరిహరింపుఁడు.

మౌనులు—దేవా! తమయాజ్ఞను శిరసా వహించితిమి. ధన్యులయితిమి. మా నేరములు మన్నింపవలయు. (నమస్కరింతురు.)

విష్ణు—మంచిది. మీ వివాదము లిఁక మానుఁడు.

సమా—దేవా! మా యీ శాపమునకుఁ దరణోపాయమునుఁ దెల్పి మమ్ముఁ గృతార్థులఁ జేయఁ బ్రార్థించెద.

విష్ణు—సమాధీ! ముమ్ముందు జరుగఁబోవు విషయము లనేకములు గలవు. వానికీ, దుర్వాసోముని శాపము ప్రథమకారణము. మీకీ శాపము కొంతకాలము వఱకు, వ్యాపింపకుండుఁగాత! మిగిలిన సంగతులకై మీ గురుశ్రేష్ఠుఁడగు నపరార్కుని సన్నిధి నాశ్రయింపుఁడు. తగిన సమాధాన మతఁడొసఁగును. భక్తిపరుఁడవై, శ్రేయమునందుము.

సమా—మహానుభావా! ధన్యుల మయితిమి. నాయవివేక ప్రగల్భములకిది యంతరాయము. (మునులనుద్దేశించి) మహాత్ములారా! మీ పాదసేవకుఁడను. క్షమింపవలయు.

మౌనులు—శుభమగుఁగాక!

ధనం—(దుర్వాసునితో) మహాత్మ సర్వా!

శా॥ నీ ముంబొప్పఁగ దుష్టసంఘమును, దా-నిందించి, భక్తాళులం
బ్రేమం జేరి, తదుక్తమార్గమున, సా-మింగొల్వఁగాంక్షించి, కాం
తామాత్యార్భకవాజి వారణరథా-ద్యైశ్వర్యముల్ వీడినన్,
గామక్రోధములెల్ల వీడకతనర్-గంపించు, నిట్లేలకో? ||

దుర్వా—ధనంజయా! కామాద్యరిషడ్వర్గము కర్మము ననుసరించియుండును. మోక్షప్రాప్త్యుపాయమునకై విజ్ఞుల సహవాసము ప్రాముఖ్యము. కాని, కర్మశేషుఁడగు వాఁడంతమాత్రముననే, సకలబంధవిముక్తినొందఁజాలఁడు. మరల, నిశ్శేషముగ నాకర్మము ననుభవించితీరవలయు నట్టివాని నాయరిషడ్వర్గ మాశ్రయించుచుండు.

ధనం—అట్టివాఁడు మరల జన్మింపవలయుఁ గదా?

దుర్వా—కర్మానుభవమునకే, జన్మయనుట లోకప్రసిద్ధవిషయము. అందు సందియ మెందులకు?

సమా—జనార్దనా! నేనిఁక మీయాజ్ఞానుసారము పరార్యుల సన్నిధికేగెద. సెల వొసంగఁడు.

విష్ణు—అభీష్టసిద్ధియగుఁగాక! పోయిరమ్ము.

సమా—మహాత్ములకెల్లరకు వందనములు. (నమస్కరించి, నిష్క్రమించును)

మానులు—వాసుదేవా! మేమును, మా, యాశ్రమములకరుగఁ గోరెదము. చిత్తగింప వలయు.

విష్ణు—మంచిది. ధర్మాభివృద్ధినిఁ గోరుదురుగాక!

మౌనులు—(కరములు మొగిడ్చి)

తే॥గీ॥ భావనాతీతుఁ, బరమాత్ము-భక్తపాలు,
నిఖిలలోకైకనాథు, వి-నీలదేహు,
నమరగణవందితుని, విజ-యప్రదాను,
నభినుతింతుము; హృదయ ప-ద్మాంతరస్థు! ॥

చిత్స్వరూపా! జయ. జయ.

నిష్క్రమింతురు; తెరవాలును.



శ్రీరస్తు.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

# వాసవీ విలాసము.

## ద్వితీయాంకము.

[బదరికారణ్యప్రదేశము. ప్రక్కన, వృక్షమూలములయందుఁ గొందఱు మునులును, నపరాగ్నులును, సమాధియుఁ, దపోనిష్ఠులై యుందురు.]

ప్రవేశము ; మృగవ్యాధుఁడు.

మృగ—(చేతనొక జింకపిల్లనిడుకొని)

పాట.

జింకపిల్లనా సంకనవుంటే, - కొంకిరిబింకిరి కష్టాకేముంటే,
సంకటితో నాకేఁవిపని? మా - యొంకటితో నాకేఁవిపని? ॥
జీవాలన్ని జింకలె అయితే, - మావోళ్లంతా మాయం అయితే,
కఱువోస్తే నాకేఁవిబయాం? - కాసికిబోతే ఏఁవిబయాం? ||
జింకమోసము సేతికొండఁగా, - సంకనపిల్లది బుంగవుండఁగా,
సల్లఁగపేణం పోవాలీ ; - సర్గంలోకీ యెళ్ళాలీ ; ||

మునేశుళ్లంతా, జింకల్నాకేదిందుకే; వోయి! వోయి! దబ్బానాయాళ్లు నాలుగు పోసలు మంతరిచ్చి సూయిస్తే, దగ్గరికొచ్చి పడుకుంటాయి. నాకు సెప్పమంటే సెప్పరేఁ. తిరగలేక సచ్చిపోతున్నా, మూన్నాళ్లకిది దొరికింది. (జింకపిల్లనుఁజూచి) పిల్లా! పిల్లో! ఏఁవి మాట్లాడవు? సంపేస్తాననా? నిన్నుసూస్తే బలేముద్దొస్తుంది. యిదో, యిదో, ముద్దెట్టుకుంటూ; (ముద్దిడి) అమ్మో! నాకడుపు సల్లఁగానూ; పెదువు తగిల్తే పేణం కైలాసఁ వెళ్ళొచ్చింది. రుసీస్సుళ్ళు కనుక్కుంటే, పీకపిసుక్కొంటారు.

వాళ్ళబ్బగంటేం పోతుంది? (జింకపిల్ల తల, నోటనిడుకొని, మరలఁజేసి) నా పిల్లో! పాపఁజేసుస్తోంది; నాకేఁవో శని చాలకుంటూఁడు. తినే పేణం వూరికుఁటుందా? యిదేమో, కళ్ళల్లో నీళ్ళెట్టుకుంటే, కడుపులో కిల్లోస్తుంది. సంపుకోని తినకుంటే, నాసావు దగ్గిరొచ్చిందన్నమాటే; బాబూ! యెన్నడూ లేని, జెమ, యిశ్వాసం, దయ్యంలాగ నాలో సేరింది. యింకబతికేదెనుస్నే; (పరీక్షఁజూచి) యిదో, మునేశుళ్ళు. యీఁడిమంతరాలు నాకొంపముంచాయి. సచ్చిన పీనుఁగుల్లాగ పేణంబిగబట్టి చెట్లకింద కూర్చుంటే, సాగపీకినా లేయరు. మొండిబతుకు బతికేవోళ్ళంతా యింతే; యీపొద్దుకు పదినాళ్ళయింది. కొత్తగుంపొచ్చింది. యేమిపని సెప్పగా! అంటే, బగ్గదేవుణ్ణి పత్యచ్చం చేసుకోవాలంట. యీళ్ళల్లో నొహణీపేరు, నేతెలుసుకొన్నా. నిన్న సెప్పినాఁడు కాదూ? సామూదని; సామాది—గోరి—యీళ్లు కుటకము నేశుక్కోఁని? (వంకరకఱ్ఱను గైకొని) వోయి! వోయి! లేండి! నెత్తరెళ్ళా బుఱ్ఱఁ గొట్టించుకుంటారు. (అందఱను గఱ్ఱతోఁ గొట్టును.)

(ఇది ప్రవేశకము.)

మునులు—ఓరీ! మృగవ్యాధా! నీతోఁ బ్రతిదినమును, మాతపమునకు విఘ్నము కల్గుచున్నది.

మృగ—ఇగ్గిన ముగ్గుగుళ్ళోళ్ళుందోయి; పిచ్చోళ్ళల్లారా! సామూరి! గోరీ! నాకీజింకపిల్లను వండిపెట్టవూ? నీకో బాగమెత్తా.

సమా—నాయనా! యెంతటి దుర్మార్గమున కొడిగట్టితివి?

మృగ—మీయమ్మలాంటివో నేను సూడక నేపోతే, నాయనాంటావు?

సమా—(గురువర్యునకభిముఖుఁడై) గురువర్యా! అపరాంగ్రమునీంద్రా! వీని వృత్తి యతి క్రూరమయినది. మనమాటలీ వ్యాఘ్రునకు గ్రహము కావు. వీనిని, సరియైన మార్గమునకుఁ ద్రిప్పనిచో, మనతపస్సును గొనసాగనీయఁడు. దయయుంచి పుణ్యము గట్టికొనుఁడు.

అప—మూఢుఁడగు నితని, కేమార్గమును సమ్మతి కాదు. పట్టినపట్టును వదలకుండుటయే, పద్ధతి.

సమా—మీరిట్లనిన, నికనేమి వచించువాఁడ? దుర్వాసోముని శాపకారణమున ఖిన్నులైయుండు మాకు, నీశ్వరుని గురించి తపమొనర్పుఁడు, శివసాన్నిధ్యమున నిశ్చింతతో నుండఁగలరని బోధించితిరి. మహాత్మా! మాకీ యంతరాయమును లేకుండ నెట్లైనఁ గాపాడవలయును.

అప—మృగవ్యాధా! నీచేతనుండు జింకపిల్లను నాకొసఁగెదవా?

మృగ—మాయబ్బతోడు, నాకడుపుమండుతూంటే, నీకియ్యనా?

అప——నీకుఁ గడుపుమండుచుండిన, దానినేమిచేసెదవు?

మృగ——ఏంచేసినా, నీవుసచ్చినా, కాసంతముక్కయినా యిచ్చేవాఁడు కాఁడీఁడు.

అప——అయ్యా! నాకక్కఱలేదు. నీకొకయుపాయమును జెప్పెద. నీకిట్టిది మరియొకటి రాఁగలదు.

మృగ——నిజఁవే సెప్తూతావా? మీయమ్మతోడూ, యింకోటొస్తుందీ? అట్లయితే, యేం సేయుమంటావు? దబ్బరయిందా? నీతస్సగొయ్య! వొంకిరిబింకిరి వోవుందిసూడు. (కన్నులుజూపును)

అప——నిక్కముగా, మఱియొకటి చూడఁగలవు. నీవాచెట్టుక్రిందఁ గూర్చుండి, కండ్లు మూసికొనుము.

మృగ——అబ్బో! బలేమోసం; నీసంగతి సెప్పడానికి నాతరఁవా? నాయబ్బతరఁవా? యిప్టఁవొచ్చినన్ని యబద్దాలు కూశావుగా? కళ్ళుమూసుక్కుంటే నాజింకపిల్లను మాయంచేద్దామని సూశావూ?

అప——నిజముగ నేను దీసికొనను. నీచేతులతోనే పట్టుకొని యుండుము. నేఁజెప్పినట్లు సేయుము. నీకు మేలుకలుగును. నీవాచెట్టుక్రిందఁ గూర్చుండుము.

మృగ——(ఒకచెట్టుక్రిందఁ గూర్చుండి) ఏమోయ్! సెప్పుమఱి; యేంసేయమంటావు?

అప——మృగవ్యాధా! నీ వెనుకనున్న దేమి?

మృగ——ఓహో? గుడ్డితనంగూడానా? సెట్టోయ్, సెట్టు.

అప——దాని, నే మెట్లందురు?

మృగ——శగిరి, శగిరి;

అప——బాగుగ వచించితివి. నీవాచెట్టుపేరును గన్నులుమూసికొని జపించుచుండుము. ఈశ్వరుఁడు ప్రత్యక్షమగును. అపుడు, నీచేతిలోనున్న జింకపిల్లనతనికిమ్ము; నీకతఁడేమి కావలసినను, నొసంగును.

మృగ——నేనుశపిస్తే నీవుసచ్చేవు పో! దూరంగాపో! నీవుసెప్పినట్టు రాకుంటే, నీబతుకు బండలేస్తా. దరింద్రపువాయాలా!

అప——కానిమ్ము; నీవాతఁడు కనఁబడువఱకచ్చటనుండి లేవకుము.

మృగ——(గట్టిగాఁ గన్నులు మూసికొని, చేతిజింకపిల్లనుంచుకొని, కూర్చుండును.)

సమా——గురువర్యా! యింతింతనరాని, యుపకారమొనర్చితిరి.

అప——మీరిఁక నాయీశ్వరుని ఱెఱిఁచి భజింపుఁడు. ఇష్టార్థసిద్ధియగు. నేనిఁక నాశ్రమమునకేగెదను. (నిష్క్రమించును.)

సమా——(నిలువఁబడి కరములు ముకుళించి)

సీ॥ కైలాసవాసాయ, - శైలాధి నాథాయ,
దివ్య స్వరూపాయ, - తే, నమోస్తు;
భవరోగ వైద్యాయ, - భయసమాహరణాయ,
తేజః ప్రకాశాయ, - తే, నమోస్తు;
పార్వతీ నాథాయ, - గర్వప్రణాశాయ,
ధీ సంవిధానాయ, - తే, నమోస్తు;
మంజులభాషాయ, - మౌనివిలాసాయ,
ద్విరసన భూషాయ, - తే, నమోస్తు;
తే॥గీ॥ మానపాలన సుగుణాయ, - తే, నమోస్తు;
మానితయశః ప్రభావాయ, - తే, నమోస్తు;
సూనశరభంజనేత్రాయ, - తే, నమోస్తు;
జ్ఞానసంపత్ప్రదానాయ, - తే, నమోస్తు; ॥

స్వామీ! మంగళాకారమణా! శంకరా! భక్తవశంకరా! సమస్తాఘనాశంకరా! దీనులమగు మమ్ముఁజూడరావేల? మామొరాలకింపవేల? తావక సందర్శన భాగ్యమొసంగవేల? మాకోర్కెలీడేర్పవేల? (నిశ్చలుఁడైయుండును.)

మఱియొకఁడు—

చ॥ సరసిజ సంభవాది సుర - సంఘమనారతమే ప్రకాశ సం
భరితుని, మోక్షరాజ్య పరి - పాలన దక్షునిఁ, బాపనాశ భీ
కరకరవాల ధారిని, సు - ఖప్రదమూర్తిని, శ్రీ త్రిశూలినిన్
బరువడిఁగొల్తు? రా, సుజన - వంద్యుని నెంతు; నభీష్టసిద్ధికై. ॥

ఇంకొకఁడు—మహేశా! నీచరణకమల సేవాసామ్రాజ్యమిడి, మమ్ముద్ధరింపుము. దయామయుఁడవగు నీవు, మాపై జాలికలుగదేమి?

తే॥గీ॥ కమలనాభుండు, ధాతయుఁ - గలిసి నీదు
మూర్తి, నాద్యంత మెఱుఁగంగఁ - బూని, తుదను,

విఫలులై రంచు వేదార్థ - వితతి, తెలియఁ
జేయు; మేమెంత వార, మో - సిద్ధవంద్య ! ||

వేఱొకఁడు—

శా॥ యాగంబుల్ పొనరించినన్, దపములన్-హర్షంబుతోఁ జల్పినన్,
యోగాభ్యాస మొనర్చినన్, జపముల-త్యుత్కర్షతోఁ జేసినన్,
శ్రీగౌరీ రమణాంఘ్రి పంకజములన్-జేపట్టుటే ముఖ్యమం
చా, గీర్వాణులు భక్తిఁ గొల్చెదరు ని-న్నారీతి, నేనమ్మెదన్ ||

సమా —(కన్నులు తెఱచి) హా! ఇఁకేమి సేయనగు? ఎంత ప్రార్థించినను, సుమానాథు నకు దయకలుగకున్నది. కర్మబంధ మీనాఁటికిని, వీడకున్నదికాఁబోలు? దైవమా! యింతయనాదరణము వహించుట పాడిగాదు. మానేరము లెన్ని యున్నను, సైఁపవలయు. నీవీనాఁడు దర్శనభాగ్య మొసఁగకున్నఁ, దుదకుఁ బ్రాణములనైనఁ ద్యజింతుము. (మిత్రులఁజూచి) స్నేహితులారా! యందఱు నొక్కపరి, నాశంభునిఁ గీర్తింతము. ప్రత్యక్షమైన సరియే; లేకున్న నిచ్చోటనే మన ప్రాణవాయువుల, శివార్పణము గావింతము.

మునులు—సమాధీ! మంచిమాట నుడివితివి. మేమును సంసిద్ధులము.

(ఒకరొక రొక్కొక్కరుగాఁ గ్రిందిపద్యము చదువుదురు.)

1. సీ|| తరిపూర్ణ కరుణతోఁ - బరికించి దీనుల,
రక్షింపుమా! గణా - ధ్యక్ష! నీవు ;
2. శరణాగతుల, మమ్ముఁ - జరణాంబుజములిచ్చి,
భరియింపుమా! భక్త - వరద! నీవు ;
3. కాత్యాయనీ పుత్రి - గణమె యనాదుముగదా!
పోషింపుమా! శేష - భూష! నీవు ;
4. దరి గానలేక యి - త్తఱి నున్నవారము ;
దరిఁ జేర్పుమా! శత్రు - దరద! నీవు ;

1. తే|గీ| నీవురాకున్నఁ బ్రాణముల్ - నిల్వమింక ;
2. జీవనము లెల్ల, వనమునఁ - జెల్లునింక ;

3. భక్తరక్షణ బిరుదంబు - వఱలదింక;
4. రమ్మ! వేవేగ; మాకు, వ - రమ్ములిమ్మ! ||

(ఈశ్వరుఁడును, కుబేరుఁడును, ప్రత్యక్షమగుదురు.)

ఈశ్వ—కుబేరా! చూచితివా? వీరి నిశ్చల భక్తిభావము.

కుబే—దేవా! ప్రమథగణసేవితుఁడవైయుండియు, నింతలో భక్తాలాపము లాలించి యేతెంచితివి. నీచెంతనుండియు నేనీవిషయము నెఱుంగనైతి. మీ యాజ్ఞానుసారము వెన్నంటివచ్చితి నంతియే; కారణమిందుఁ దెలియఁబడియె.

ఈశ్వ—భక్తులారా! మీప్రార్థనమునకు మెచ్చితిని. అభయమొసఁగితిని. ఎందులకై మీరిట్లు ఘోరతపమొనర్చితిరి?

సమా—మహాత్మా! దుర్వాసోముని మాలో నూటరెండు గోత్రముల వారు మాత్రము కీర్తిని గడింతురనియు, మిగిలినవారెల్లరును వంశదూరులగుదురనియు, శపించె; మిమ్ము శరణందితిమి.

ఈశ్వ—మునిశాపము వృథయగునటు లెట్లు? శాపకారణమును నే నెఱింగితిని. అయినను, నాకు మీపైఁ గరుణయెంత కాలముండునో, అంతవఱకు నాసన్నిధి నుండఁగలరు.

మునులు—మహానుభావా! మాకంతకంటె నెక్కుడేమి కావలయును? ధన్యులమయితిమి.

(ఎల్లరును సాష్టాంగవందనము లర్పింతురు.)

ఈశ్వ—లెండు; మీ మనస్సులలోఁగల వ్యథనిఁక మానుఁడు. (కుబేరునిఁ జూచి) మిత్రమా! కుబేరా! వీరినెల్లరను నీపుష్పకముపైఁ గూర్చుండఁబెట్టికొని, కైలాసమున కరుదెంచుము. (మృగవ్యాధునిఁ గనుగొని) ఆహా! ఇతఁడుకదా? నిశ్చయ భక్తుఁడు. మన మిందఱిచట మాటలాడుచున్నను, జలింపక చిత్తైకాగ్రతనందిన బుద్ధిశాలి. (సమీపించి, లేవనెత్తి) నాయనా! మృగవ్యాధా! నీ భక్తికి నచ్చెరువందితిని. నీకేమి కావలయునో? చెప్పుము.

మృగ—సామీ! దణ్ణాలు. దణ్ణాలు. (నమస్కరించి) జింకపిల్లతెచ్చావా? బాబూ! నా జింకపిల్ల నివ్వో యిస్తా తీస్కో.

(శివుఁడు జింకపిల్లను గైకొని, మృగవ్యాధుని శిరముపైఁ జేయిడి)

ఈశ్వ—మానులారా! ఈమృగవ్యాధునకుఁ గారణాంతరముచే నీట్టిజన్మము లభించినది. అపరార్థునుపదేశమున వీఁడునుఁ గొంతవఱకు ధన్యుఁడయ్యె; వీఁడు మీకిప్పటి

కిని సేవకుఁడై మీయాజ్ఞననుసరించియుండును. మీరును, నభిమానబుద్ధితో నితని నేలుంగవలయు. ఇప్పటినుండియు,ఁ గ్రూరబుద్ధియు మూఢత్వమును నితనినిఁ దొలఁగిపోవుఁగాక ! యని యాశీర్వదించితిని.

మునులు—మహాత్మా! మీయాజ్ఞానుసార మితనిని మా వెంటనిడుకొని యభేదముగఁ జూచెదము.

మృగ—(శివునింగాంచి) మహాత్మా! మీ రెవరో? నాతలపైఁ జేయిడినంత మాత్రమున, నాయజ్ఞానము పటాపంచలైనది. మీ వాక్యానుసారము నడచుకొనువాఁడ. ఆజ్ఞయొసంగుఁడు.

ఈశ్వ—నీవును వీరలతోఁగూడి నానివాసమగు కైలాసమునకు రమ్ము. వీరితో పాటు నన్నియును నీకు నొదఁగూడును.

మృగ—చిత్తము.

ఈశ్వ—కుబేరా! ముందువచించిఁరీతి వీరినందఱను కైలాసమునకుఁ గొనిరమ్ము. నే నిదే వచ్చెద. (నిష్క్రమించును.)

కుబే—(పుష్పకమునుద్దేశించి)

క॥ సురపూజ్యమై వెలింగెడు
నరపుష్పకమా! మహేశ-భక్తుల కొఱకుం
ద్వరితముగ రమ్ము; మన మీ
తరుణముననె, వెండికొండ-దరిఁ జేరవలెన్ ||

(ఆకసమునుండి, విమానరాజము దిగివచ్చును.)

కుబే—వైశ్యశ్రేష్ఠా! మీరీ విమానము నధిష్ఠింపుఁడు.
(మృగవ్యాధునింగని) భక్తాగ్రేసరా! నీవును నిందుఁ గూర్చుండుము.

మునులు—ధనాధిపతీ! ముందు మీరధిష్ఠింపవలయు. మాకీ కైలాసప్రాప్తిఁ గల్గించుచున్న మీయుదారస్వభావము నెన్నఁటికిని మఱవము. మీరుమాపై శాశ్వతమగు విశ్వాసముంచి పరిరక్షింపవలయు.

కుబే—అట్లుశేయుదుఁగాక! (తాను బుష్పకములోఁ గూర్చుండును)
(వైశ్యశ్రేష్ఠుఁడును, మృగవ్యాధుఁడును, విమానమునకు మ్రొక్కులిడి లోనఁగూర్చుండి)

సీ॥ ఈశ్వర కృత్యంబు - లేరీతి జరుగునో?
    వివరించునే, యెట్టి - విజ్ఞుఁడైన;
సర్వాంతరాత్ముల - శర్వుఁడెట్లుండునో?
    యెఱుఁగునే, యెట్టి యో - గీంద్రుఁడైన;
మోక్షసామ్రాజ్య మే - మూలఁ బాలించునో?
    కాంచునే, యెట్టి వి - కాసియైన;
లీలావతారంబు - లోలి నెట్లొందునో?
    తెలియునే, యెట్టి ని - ష్కలుషుఁడైన;

తే॥గీ॥ గదల దేగడ్డిపోఁచయుఁ - గాని యతని
సూక్ష్మసంకల్పమే లేక - క్షోణియందు,
నెట్టి చిత్రింబుఁ గలుగద - దేవ్వడైనఁ
గనుక, నాతని భజియింపఁ - గలిగె మాకు; ||

(విమానము కొంచెము కొంచెము పైకిలేచుచు - డును.)

తెరవాలును.

# వాసవీ విలాసము.

## తృతీయాంకము.

[ కైలాస నగముపై, నీశ్వరాభవనము ముందుఁగల వనప్రదేశమున, సుశీలయు, మాలినియుఁ, గమలయుఁ, బూవులఁ గోయుచుందురు ]

కమల—సుశీలా! నయనాభిరామమగు, నీ యారామమెంత పేర్మిఁ గొలుపుచున్నది ?

సీ॥ కమనీయకాసార _ కల్లోలమాలికా
డోలికా కేళినిఁ - దేలి తేలి;
తరుణారుణప్రభా - కర సహకార కో
మల పల్లవంబుల - కలరి యలరి;
పరిపక్వదాడిమీ _ ఫలవినిర్గతసర
సాంకురపాళిరా - పాడి యాడి;
మందార మల్లికా - బృంద నిర్యన్మక
రంద ధారలఁ దృప్తిఁ - జెంది చెంది;

తే॥గీ॥ కలవిహంగముల వ్యక్త _ గాన కౌశ
లంబుఁ జూపఁగ విని ప్రమ - దంబు నంది;
మలయ మారుతమాడింపఁ - జెలఁగి, శిరము
లూఁపుచుండెను, దమశాఖ - లొక్క మొగిని; ॥

సుశీల—నెచ్చెలులారా! పుష్పవతియగు నీమల్లికాలత, యీ పున్నాగము నెట్లు పెన వైచికొనినదో, చూడుఁడు.

మాలిని—ఔనమ్మా! పుష్పవతియైన లతాంగి పున్నాగమును బెనవైచికొనదా?

కమల—నీవు మాలినివి గావుననే, నీకాశ్లేషమునందభిరుచి యెక్కువ.

మాలిని—ఔను. కమలాకరము మధుపానమత్తల సంగతి కాకఁజెందుచున్నది. చూడుము.

కమల—మంచిమాటలతో నీ నన్ను మధుపానమత్తలతోఁ గూర్చెదవా? ఎంతసాహసికురాలవు?

మాలిని—కాదు. కాదు. వారి వారి ప్రేమను మరల్ప నొరులకు సాధ్యమా? అంత మాత్రమున కాక్షేప మెందులకని నేనంటిని.

సుశీల—విద్యాధికురాండ్రగు మీరు, పరిహాస వాక్యములతోఁ బొద్దుపుచ్చకుఁడు. నాకా మల్లెపూవులఁ గోసియిండు.

(తీఁగ నొకరువంచి, యింకొకరు పూవులఁ గోసి యిత్తురు.)

సుశీల—(చేతఁ బూవులఁ బట్టుకొని) సఖులారా! పార్వతీదేవి, యీశ్వరుని వరింపఁ దలఁచి, పరిచర్యలొనర్చునపుడీ పూవులచే నతనిఁ బూజింప, మల్లికార్జుననామ మప్పుడతనికి, నెలకొనియుండునేమో కదా!

కమల—అమ్మా! నీవును, నీ మేనత్త కొమారునకీ పూలనలంకరించి, సార్థకనామధేయు నొనర్పుము.

సుశీల—చాలును లెమ్ము. నీవట్టులనే చేసియుంటివి కాఁబోలు?

మాలిని—(వెనుకకు మరలిచూచి) ఎవరో? యిటు వచ్చుచున్నట్లు పదముల చప్పుడగుచున్నది. కమలా! సుశీలా! వీరును జూడుఁడు.

సుశీల—ఎవరో? యననేల? దేవతలెల్లరపుడప్పుడిందుఁ దిరుగాడుచునే యుందురు. మనకివి క్రొత్తగాదు. కాని, యదిగో! లేమావిచిగుళ్లను, గడుపారమెక్కి, గానమొనర్చుచున్న పికమును గనుఁగొనుము.

ఉ॥ తెక్కు విదిర్చి, లేఁజిగురు - రీతిఁగనుంగొని, ముక్కుఁజాఁపుచున్,
నిక్కుచుఁ జెంతఁజేరి తన - నేర్పుమెయిం గడుపారమెక్కి, పెం
పెక్కఁగఁ గూయుచుండి, గళ-మొంతయుఁ దా సవరించి, గానమున్
మక్కువ మీఱఁ జల్పెడిని; - మంజులవాగమృతంబు చిందఁగన్.॥

కమల—సుశీలా! నీవు సరిగాఁ జాణవైతివి. ఆసమీపముననే;

తే.గీ॥ గానకళలకుఁ జొక్కి, వి - కాసమొదవఁ
దన్మయత్వంబుచేతను - దనదు పింఛ

మల్లనల్లన విచ్చి, నా - ట్యంబు సేయ
చూడదె; నొకచిత్రి కంఠంబు - చోద్యమంద; ||

ప్రవేశము; చిత్రకంఠుఁడు.

ఉ॥ కమ్మని పూవుఁదేనియలఁ-గాలముఁ బుచ్చుచుఁ బాటపాడు భృం
గమ్ముల గీతమో? మదపి-కస్వరమో? యలభారతీ కరా
బ్జమ్మునమన్న వీణియ ప-సందగు నాదమొ? యేదియో? ననుం
ద్రిమ్మరిఁ జేసి, మోహమునఁ-దెచ్చెను; జంత్రపుబొమ్మకై వడిన్. ||

కన్నెమిన్నలారా! గానసుధారస ధారలఁగ్రోలి, యానందించి తన్మయత్వమందిన నన్నిపుడు మీమాటలచేఁ బ్రజ్ఞాన్వితు నొనర్చితిరి.

సుశీల—(నెచ్చెలులఁ గనుఁగొని, చిఱునగవునఁ దలవంచుకొనును.)

కమల—మహాశయా! మీ రెవరో, మే మెఱుఁగము. చిత్రకంఠము. తన్మయత్వమున నాట్యము సేయుట, నే నాచెలికిఁ జూపితి నంతియే;

మాలిని—మహాత్మా! మీ రెవరు? పవిత్రములగు మీ నామాక్షరము లేవి? మీ మదికి, సమ్మతియైన విన్గోరెదము.

చిత్ర—సుందరులారా! చిత్రకంఠుఁడను గంధర్వుఁడను. నాపూర్వ పుణ్యవశమునఁ గన్నులపండువుగ, మిమ్ముఁ జూచితి. మీరును, నాకొక సందియముఁ దీర్పవలయు నని కోరెద.

చ॥ అనుగిడ నెత్తుపల్ తొరఁగు-నట్టి పదంబులు, నెండతాకకై,
జడిసెడునట్టి దేహముఁ, బ్ర-శస్త కళాకరమైన మోము, నే
యెడఁ గనుఁగొన్నఁ దట్టులను-నీనెడు చూపులుఁ గల్గియున్న యీ
బిడ, యెవరో? వచింపఁదగుఁ-బ్రీతిమెయిన్, హృదయంబురంజిలన్

మాలిని—ఆర్యులగువా రడిగినఁ, దెలిసిన దానిని వచింపవలయుఁ గదా? యీ ముద్దరాలు, వైశ్యగణమునందలి శంభుశ్రేష్ఠియను వాతని కూఁతురు. మాకత్యంత ప్రియురాలు

చిత్ర—(తనలో)

ఉ॥ వాసనఁజూడనట్టి ప్రసవంబు; కరాంగుళిబాధ నందకే
భాసిలు పల్లవం, బిది లవంబును విద్ధముగాకయుండఁ జే
ర్వాసినిఁగన్న రత్న; మపు-రా చవిచూడని క్రొత్తతేన; తాఁ
జేసిన దీర్ఘ పుణ్యఫల-సిద్ధి; యెవండనుభోక్త? యీపెకున్ ||

క్షణకాలములో, నామనస్సునంతయు నాకర్షించుచున్న, యీ యువతి సౌందర్యమును నుతింప, నాతరముగాదు.

కమల—ఆర్యా? మీరేదియో, యోజించుచున్నట్లున్నది.

చిత్ర—దేవలోకమునఁగల, చిత్రవస్తువులం దొకటైన, నిపుడు నాచేత లేకపోయెఁగదా? యని, చింతించెద.

కమల—మీకిందువలనఁ గలిగిన లోపమేమికలదు?

చిత్ర—ఇంతకంటె, లోపము మఱొండు కావలయునా? వయోరూప రమణీయులగు నీబాలలు, రిక్తచేతులఁ జూడవలసివచ్చె;

మాలిని—మీవాక్యములచే నన్నియు నొనగూడినవి. దయార్ద్ర హృదయులగువారి సందర్శనముకంటె, నతిశయమేది?

సుశీల—సఖులారా! నేనిఁక మానివాసమునకేగెద. మీరిందుండవలసిన నుండుఁడు.
(పోఁబోవును.)

కమల—(జనాంతికముగ, మాలినితో) మన సుశీల హృదయమున నేదియో, యనుమానము జనించినట్లున్నది.

మాలిని—(జనాంతికముగ) అనుమానముకలుగు కారణమేదికలదు? కానిమ్ము; నిలుకడపై నిజము బయలుపడకుండునా? (ప్రకా) సుశీలా! మేమును వచ్చెదము. క్షణమాగుము. ఎదుట మాటలాడువారిని విడిచిపోవుట, ధర్మముకాదు.

సుశీల—(తనలో) వీరింకను నితనిభావముఁ దెలిసికొనరయిరి. (ప్రకా) మాతలిదండ్రులాలస్యమునకై కోపపడుదురు. నేనిఁకనుండను.

చిత్ర—యువతీరత్నమా! తలిదండ్రులపై నీకుఁగల గౌరవము మెచ్చఁదగినదియే, కాని, యతిథుల, నాదరింపకపోవుట మాత్రము మంచిదికాదు.

సుశీల—పెద్దవారికి నెఱుఁగఁజేయుట మాపని; ఆదరించుట వారి ధర్మము.

చిత్ర—(తనలో) ఈపెమాటలకు సమాధాన మొసఁగుటకే, నాకుఁ దోఁచకున్నది. ఇఁక నామె హృదయభావ మెఱుఁగుటకు వీలెట్లు? క్షణక్షణమునకు మోహమతిశయించుచున్న నేనిఁక భరింపఁజాల.

ఉ॥ పలికిన ముత్తెముల్ దొరియు;-భావమెలర్పఁగ వాలుచూపులం
జలికినఁ గార్మొగుంగులటఁ-జేరును; గాంత విలాసయానయై
కులికిన హేమవల్లికయొ-గోచరమౌఁ; దరుణీ శిరోమణిన్
దలఁకని స్వేచ్ఛఁ గౌఁగిటను-దార్చిన, స్వర్గసుఖంబు లేటికిన్? ॥

(ప్రకా) తన్వీ! నీపేరెయ్యది!

సుశీల—(మాఱు పల్కక, సఖులవంకఁ జూచును.)

కమల—ఆర్యా! సుశీలయనియందుము.

చిత్రి—ఈకాంతకుఁ బరిణయభాగ్యమబ్బినదా?

(మువ్వురు నొకరివంక నొకరు చూచుకొందురు.)

మాలిని—(జనాంతికముగఁ గమలతో) నీవు, ముందనినట్లు, మన సుశీల కనుమాన మొదవింపఁగల మాటలతని నోట వెలువడుచున్నవి.

కమల—ఆర్యా! యింకను, నీమెకు వివాహము లేదు.

చిత్రి—(తనలో)

తే॥గీ॥ హృదయమా! నీవు సందేహ-మింక వదలి
స్వస్థతనుగాంచుమా! భోగ-భాగ్యమొదవు;
ననుభవింపఁగఁ దగిన దీ-యలరుఁబోణి;
యెట్టులైనను, నేఁడె గ్రహింతు దీని; ॥

(ప్రకా) సుశీలా! నీకుఁదగిన మనోహరు నొకనిఁ జూపించెద. సర్వసుఖముల నోలలాడఁగలవు. నీవతని వివాహమాడిన, మణిచేఁ గంకణమును, గంకణముచే మణియుఁబోలెఁ బ్రకాశింతురు. అవివాహితవగు నిన్నడుగవచ్చునని యడిగితిని. అంగీకరింతువా?

సుశీల—(ఏమియుఁబలుకక, చరాలున వెనుదిరిగిపోవుచు) సఖులారా! యిఁక మీ యిష్టము. (అని, వెడలిపోవును.)

కమల—అయ్యా! మాస్నేహితురాలగు సుశీలను విడిచి, మేముండుట సరికాదు. చిత్తగింపుఁడు. మేమును బోవలయు.

చిత్రి—(తనలో) ఔరా! ఆ యువతీమణి, మాఱువచింపక వెడలిన కారణమేమి

తైరయుండును? [ప్రకా] కాంతలారా! మీ ప్రియురాలి తలిదండ్రు లెందున్నారు? నా హృదయోద్దేశము నీకదాఁపనేల? మీ హితురాలినిఁ గాంచినది మొదలు. నాకపరిమితానురాగ మొదవినది.

మాలిని—సరియే! అల్లదే! మహేశ్వర భవనము చెంతకుఁ బరమేశ దర్శనార్థమై బంధుగులతో, సుశీలతండ్రిగారు వచ్చువేళయైనది. మేమిఁక వెడలవలయు. మీరు, వారితో మాటలాడుఁడు

[ఇరువురు, నిష్క్రమింతురు.]

చిత్ర—(స్వగతము) ఆలతాంతన్వి, నివాసమునకేగుచుఁ జెలుల నొడబ్బరించు నెపమున నన్ను మరలఁ జూచుటయు, నంతకుమున్ను వివాహప్రసంగములకు మాఱు వల్కక, యిటనుండి వెడలుటయు, నంగీకారసూచకములై యున్నవి. ఇదిగాక, నేనా పెపిరియురాండ్రతో మాటలాడుతతి, సిగ్గుచే మోము నావలకుఁ ద్రిప్పినను, నామాటలకిచ్చగించి శ్రవణము నీపక్కకే యొగ్గి నిలిచియుండెను. నేనిప్పుడీ యిర్వురతో, నాకన్నిఁటి మిన్నపై నాకభిమానమున్న విషయమును వచించినాఁడను. తప్పక నన్నా బాలిక వరించితీరును (బొమముడితో) ఛీ! ఏమిది? నావామ నేత్రమదరుచున్నది. వారి తలిదండ్రులు నాకాకాంత నొసంగుట కంగీకరింపకు కావలయు. (ధైర్యముతో) ఎందుల కంగీకరింపకుందురు? నాకేమిటఁ గొదువ కలదని? ఇంతయును, వారికనంగీకారమే యగుచుమాత్రమున, నేవదలుదునా? ఆ ముద్దులగుమ్మతో సుఖింపని జన్మమెందులకు? కానిమ్ము! అభిజ్ఞ తండ్రియు నిచటికి వచ్చువని గదా? సవినయముగఁ గూఁతునిమ్మని ప్రార్థించెద.

(మెల్లఁగ, నీశ్వరాలయముకడకు నడచుచుండును.)

(కొందఱు వైశ్యస్త్రీలును, శంభుశ్రేష్ఠియు; మహేశ్వరభవనము చెంతకుఁ బ్రవేశింతురు.)

చిత్ర—మహాత్ములకెల్లరకు వందనములర్పించువాఁడ. (నమస్కరించుచు.)

వైశ్య—భగవంతుఁడు రక్షించుఁగాత!

శంభు—మహాత్మా! మీ నామధేయమేమి? ఏ రాజ్యమునకధిపతులరు?

చిత్ర—మణిపురాధీశ్వరుఁడను. చిత్రకంతుఁడందురు. మీవలన నొక యుపయోగము నందవచ్చితిని. ఆదరింపవలయు.

శంభు—

చ॥ అడవుల సంచరించుచు, ని-రంతరముఁ మునివృత్తిఁబూని, మే
మునుగక యీశ్వరార్చనము-లొప్పుగఁజల్పుచు, శాంకరీకృపా

జలధిని నోలలాడి, యిట-సౌఖ్యమునందుచునుందుమయ్యా! మ
మ్మాసిగెమునట్టిదేది కల,-దద్భుతమీ నుడులాలకింపఁగన్. ||

సామ్రాజ్యపట్టభద్రులగు మీకెక్కడ? ఈశ్వరసేవయే, సకలకార్యము లొనర్పుటయని, భావించి, చరించు మేమెక్కడ? మావలన మీరు పొందఁదగిన యుపయోగ మెద్ది?

చిత్రి — నాజీవిత సర్వస్వము మీచేతఁగలదు. మీరొనర్పు నుపయోగముననే, నేను సౌఖ్యపడఁగలను.

శంభు — అయ్యా! మీరు, మేమెవరయినదియు నెఱుఁగరు. మేమెల్లరము వైశ్యగణము వారము. కృతయుగము కడపటినుండియు, నిటనే, సకుటుంబముగ, గౌరీశంకరుల కరుణకుఁ బాత్రులమైయున్నారము.

చిత్రి — మీరు వైశ్యగణమువారనుట తెలిసియే, మాటలాడుచున్నాఁడను. నాకోర్కెఁ దీర్తుమని యభయమొసఁగుఁడు.

శంభు — అయ్యా! మీరింత కళవళపాటునంద నేల? మీయభిప్రాయమును దాఁపక తెలియఁజేయుఁడు మేమొనర్పుటకు వీలయినకార్యమైనచో, నెఱవేర్తుము.

చిత్రి — వీలయిన కార్యమనియే, మిమ్మాశ్రయింపవచ్చితిని. ఇఁక దాఁపనేల? చిత్తగింపవలయు.

ఉ॥ బాలకురంగలోచన, శు-భప్రతిపాదనశీల, యప్సరో
జాలనుతానురూప జన-సంఘవిలోల, కృపాలవాల, నీ
బాల, సుశీల, నాహృదయ-పద్మము నొక్క క్షణంబులోనఁ దా
నోలి గ్రహించె; నా మెను మ-హోత్సవ మొప్పఁగ, నాకొసంగుఁడీ!

శంభు — (వైశ్యులఁదిలకించి, యోజించుచుండును.)

వైశ్యులలో నొకఁడు — మణిపురాధీశ్వరా! మీ మాటలవలననే మీరు గంధర్వులని తోఁచుచున్నది. వైశ్యపుత్రికను మీకొసఁగుట ధర్మమా?

చిత్రి — మహాత్మా! మన్మథానల జ్వాలలచేఁ దపించుచున్న నన్నా కన్యకామహాస్నేహజలితవారిధారలచే, సౌఖ్యపడఁ జేయుటకంటె వేఱు ధర్మమెద్ది కలదు?

వేఱొకఁడు — కులధర్మమును వీడుట కెవఁడు సాహసించును? కామోద్రేకుఁడవై నీవిట్లాడుచున్నాఁడవు.

చిత్రి—నిక్కముగ వచించుచున్నాఁడను. మీరాయువతీరత్నము నొసఁగిన, నాకుఁ బ్రాణదాన మిచ్చినవారగుదురు. లేదా? నాకు హంతకులును మీరే యగుదురు.

శంభు—అయ్యా; కానికార్యమునకు మీరింత నిర్బంధమొనర్చుట సరికాదు. ఇఁక నాప్రశంసమానుఁడు. వేఱు విషయమేదేనిఁ గల్గిన మాటలాడుఁడు. లేనియెడ, మావందనముల గ్రహించి, దయచేయుఁగోరెద.

చిత్రి—వలదు. మీరింతటి కఠినమూనవలదు. దాసానుదాసుఁడనయ్యెద. మీబాల నొసఁగి, నన్నుఁ గృతార్థునిఁ జేయవలయు.

శంభు—మీరెంత పలవరించినను, ఫలములేదు. మీమాటలు గానుగాను గ్రోధమును సమితము కలిగించును.

చిత్రి—ఫలములేదా? నాజీవితము నంతమొందింతురా? క్రోధము కలిగి, నన్ను మీరేమి చేయఁగలరు? అవివాహితయగు, నా కాంతను బలవంతముననైన గ్రహించుట, నాకు ధర్మమే

శంభు—(ప్రక్కలనున్నవారలఁజూచి) వింటిరా? యితని దురాలాపములు.

ఒకఁడు—కాముకునకు లజ్జాభయములు రెండును, శూన్యములు.

మిగిలినవారు—అయ్యా! నీతో వాదించుటకై మేమిటనుండలేదు. అక్కఱమాలిన మాటల, నడ్డులేక పలుకుచుంటివి. కనుక నిప్పటినుండి వెడలిపొమ్ము.

చిత్రి—ఔరా! మీరెంతటి కఠిన హృదయులు? (కోపముతో)

తే॥గీ॥ ధాత, మిమ్ముల సృజియింపఁ-దలఁచినపుడె,
పల్కులకు మాత్రి మతి మృదు-త్వంబు నొసఁగి,
హృదయములు ఱాయివలెఁ జల్పె-నేమొ? కాక,
యెంత వేఁడినఁ గరుణ యొ-కింత లేదె? ||

నేనెంత బ్రతిమాలినను, వినక, నన్ను మన్మథాగ్నియందు దహింపఁబడఁ జేసితిరి. కావున నిదే, నాకీగతిని లభింపఁజేసిన వారెల్లరు, సంబంధులతోఁగూడఁ గొంత కాలమునకు, నగ్నిలోఁబడి చత్తురుగాక!

శంభు—దుర్మార్గుఁడా! గుదకెంతపనిఁ గావించితివి? నిష్కారణముగ మాకీశాపమొసఁగిన నీవును, మాశాపానుభవదినమున నచ్చోటనే తలవ్రియ్యలై, నాశమునందుదువు గాక!

చిత్రి—ఛీ! మీముఖముల నిఁకఁజూడఁగూడదు. (నిష్క్రమించును.)

వైశ్యుని యొకఁడు—ఏమికారణమో? కాని, హఠాత్తుగ మనకిట్టి కష్టము లొదఁగూడు చున్నవి. పిలువని పేరంటమునకువలె నీగంధర్వుఁడే తెంచి, శాపమొసఁగిపోయె; ముందిఁక నెన్నియిడుమలున్నవో? యని, భయమయ్యెడిని.

రెండవవాఁడు—మనకన్ని మీవిధమున, బాధింపుచున్నదనుకొందము. లేకుండిన, భూలోకము మొదలుగ నన్నిలోకములయందును దిరుగుచు, బాధముగడిపుచు, నపుడపుడుమాత్రి మీశ్వరసందర్శనమున కేతెంచుచు, సామాన్యముగ, మన గణములే, యెందఱో! మాయామోహితమగు మర్త్యలోకమున వసించు చుండ, వారికేలోటుపాటును లేకుండుటయు; నిరంతరమును శివసాన్నిధ్యమును వీడక, వెఱవిషయములకుఁ జెవినొగ్గక, యీపర్వతమే, నివాసమనియుండిన, మనకీ యంతరాయములు గల్గుటయా?

శంభు—బాంధవులగు మీకును, నన్నుగుఱించి యిట్టిదశపట్టినది.

తే॥గీ॥ దొంగజతఁజేరి శిక్షకు-లొంగినట్లు;
అతి దరిద్రుని జతఁజేరి-యలసినట్లు;
త్రాగుబోతు జతంజేరి-మ్రింగినట్లు;
కష్టజన్ము ననుంజేరఁ-గష్టమబ్బె; ॥

మూఁడవవాఁడు—నీవిట్లు నిందించుకొనఁదగదు. మాకైగదా? మొదట దుర్వాసోముని శాపమునను భిన్నతనందనకుండ, మహేశ్వరుఁ బ్రత్యక్షమొనర్చుకొని, కైలాస ప్రాప్తిఁ గల్గించితివి; ఈశ్వరసేవాధురీణుఁడవై, శంభుశేఖరియను నామము నందితివి; మనమెల్లరము నితరచింతా వర్జితులమై, చాలకాలమునుండియు సుఖ ముగ నిందుంటిమి, ఈదుర్మార్గుఁ డొకఁడే తెంచి, మన మనస్సులఁ గలఁతపా టొదవఁజేసెఁ; గనుక, నీవొనగూర్చిన కష్టమేదికలదు?

శంభు—బాంధవులారా! నాకొక యుపాయము తోఁచుచున్నది. ఏమందురా? మనమెల్లరము, గౌరీశంకరులఁ బ్రార్థించి, వారి సన్నిధినిఁ ద్వరగా, నాకొమార్తె యగు సుశీలను, నాచెల్లెలి కొమారుఁడగు మల్లికార్జునున కొసఁగి, వివాహ మొనర్తము; లేకున్నఁ, గామాంధుఁడగు నాచిత్రకంఠుఁడు మనబిడ్డను మన నీయఁడు.

వైశ్యులు—మంచిమాటను వచించితివి. ఆలస్యమొనర్పక యీకార్యము నిర్వహించి తీఁపవలయును.

శంభు—అట్లయిన, నేనిదే నాభార్యకడకేగి, తగు ప్రయత్నములఁజల్ప, నియోగించి, మా బావగారితో మాటలాడి, యెల్లరును నిచ్చోటికి వచ్చునట్లొనర్చెదను. (నిష్క్రమించును.)

మఱియొకఁడు—అయ్యా, నేనును, వలయు పుష్పముల, సేకరించికొని త్వరగా వరుదెంచెద. (నిష్క్రమించును.)

మిగిలినవారు—మనవారు వచ్చునంతవఱకును, నిట నేమి సేయవలయు? వృథా, కాలయాపన మొనర్ప నేల? భగవంతుని ధ్యానింతము.

(కరకమలములు ముకుళించి)

సీ॥ శ్రీ చిన్మయాకార! - ప్రాచీన భవహార!
శ్రితజనమందార! - సితశరీర!
కరుణారస విహార! - శరణాగతోద్ధార!
భయగజసంహార! - ప్రథితశూర!
అరివర్గ జనదూర! - యపమృత్యు పరిహార!
భక్తాను సంచార! - పరమధీర!
మోక్షసంపత్కార! - దక్షసుతాధార!
విమలగుణోదార! - వేదసార!

తే॥గీ॥ నిరుపమానంద సందోహ - నియత విదిత
జగదభినుతాను చరిత ప్ర - శస్తమూర్తి!
మానిగణమాన సాంభోజ - మత్తభృంగ!
వందన శతంబు లర్పింతు - మందికొనుము॥

[శంభు శ్రేష్ఠియు, నతనిభార్య-ప్రతాపవతియుఁ, గుమార్తె-సుశీలయు, మఱికొందఱు సువాసినులు, వైశ్యస్త్రీలు, మంగళద్రవ్యములతో వరుదెంతురు. వారివెనుక, మల్లికార్జునశ్రేష్ఠియు, నతని తలిదండ్రులు, నవరాఘవుఁడు, వత్తురు.]

శంభు—మీరందఱు నిటనుండుఁడు. నేను లోపలికేగి, మహేశ్వరునకు గంధర్వుని

దుండగము తెలియఁజేసి, యతని భయమువకై మనమొనర్చినవివాహ ప్రయత్నము నెఱిఁగించి. దేవీసహితునిగాఁ దోడ్కొనివచ్చెదను.

అందఱు — మంచిది. శుభమగుఁగాక! పోయి, రమ్ము.

[శంభుశ్రేష్ఠి, యీశ్వర భవనములోనికి నిష్క్రమించి, కొంతతడవునకు, గౌరీశంకరులకు వందనములర్పించినపిదప, సువాసినులొక వరుసను, బురుషులొక వరుసను, నిల్చుకొందురు.]

ఈశ్వ — అపరార్క మునీ! యాలస్యమెందులకు? కల్యాణము జరిగింపుము.

అప — చిత్తము. (శంభుశ్రేష్ఠితో) శంభుశ్రేష్ఠీ! వధూవరుల, నభిముఖముగ నిలువఁ బెట్టుము.

శంభు — (వధూవరులను సరిగానిల్పి) గురువర్యా! యిఁకేమి జరుగవలయును?

అప — (పూలహారములు రెండు వధూవరులకొసఁగి, మఱిరెండు హారములు శంభుశ్రేష్ఠి చేతికి నతని భార్యచేతికినిచ్చి) శంభుశ్రేష్ఠీ! మీరీహారములఁ బార్వతీపరమేశ్వరుల కలంకరించి, యనుజ్ఞనొందుఁడు.

(శంభుశ్రేష్ఠియుఁ బ్రియాపవతియు, గౌరీశంకరులకు, హారములువైచి, నమస్కరింతురు.) [మంగళవాద్యములు చెలరేఁగును.]

అప —

తదేవలగ్నం సుదినం తదేవ । తారాబలం చంద్రబలం తదేవ ।
విద్యాబలం దైవబలం తదేవ । లక్ష్మీపతే తేంఘ్రియుగం స్మరామి ॥

సుముహూర్తమస్తు. సుప్రతిష్ఠితమస్తు.

(అక్షతలు ల్లెల్లర కొసఁగును.)

[వధూవరులు పూలహారముల నొకరికొకరు వేసికొందురు.]

అప — అమ్మా! సువాసినులు పాటలు పాడుఁడు. ఊరకున్నా రేమి!

అయ్యా! మంగళవాద్యములు కొంచెమాపుఁడు.

[సువాసినులొక పాటను బాడుదురు.]

అప — శతమానంభవతి శతాయుః పురుషః

శతేంద్రియ ఆయుష్యే వేంద్రియే ప్రతితిష్ఠతి. ॥

సమస్తసన్మంగళాని సన్తు.

(అక్షతలు వధూవరులపై నెల్లరుఁ జల్లుదురు.)

శంభు—సుశీలా! మల్లికార్జునా! మీరిరువురు పార్వతీపరమేశ్వరులకుఁ బెద్దలకు నమస్కారములు సేయుఁడు.

(వధూవరులకు గౌరీశంకరులు దీవనలిచ్చుచుండఁగాఁ, పార్వతీ పరమేశ్వరులకు దంపతులు నమస్కరింతురు)

అప—అమ్మా! ప్రతాపవతీ! నీకొమార్తె పతిభక్తికి లిగి, యుభయగోత్రములకు, సద్యశముఁగూర్చును గనుక నిఁకనుండి, సుశీలకుఁ గీర్తియను నామము లభించును. నీవును, సోమదత్తుఁడనియు, సమాధియనియు, నామాంతరములుగల నీపతి శంభుశ్రేష్టియు నానందసాగరమున నోలలాడుదురుగాక! (సువాసినులఁజూచి) మాతైదువలు, హారతి సేయవచ్చును.

[సువాసినులు హారతిపళ్ళెముగైకొని, మంగళహారతిఁ బాడుచుందురు.]

శైలవాలును.





# వాసవీ విలాసము.

## చతుర్థాంకము.

[ దేశీయసభ చెంత వైశ్యులు కొందఱు కూర్చుండి యుందురు ]

ఒకఁడు—నేఁటికి గంధర్వుని వలనిభయము మనశంభుశ్రేష్ఠి కూఁతునకుఁ దొలఁగిపోయెను; మేనఱికపు ధర్మము బాలించిన వారలయితిమి.

మఱియొకఁడు—నిశ్చలమైన యుద్దేశమునకు భంగము కలుగునా? ఈశ్వరుఁడు మన పాలిటనుండె; నిఁకేమికొఱఁత?

ఉ॥ ప్రీతి తలిర్పఁగా సుతులు-వేవురుగల్గినఁగాని తండ్రికిన్
భీతియొకింత పుట్టును; వి-వేచనసేయ నొకర్తయైననున్
గూఁతురు కల్గెనేని, దన-గుండెలు నీరగు; సానురూపుఁడై
జాతికిఁదగ్గ పూరుషుఁడు-జాయుఁగఁ గైకొను నంతకాలమున్॥

కావున, మనశంభుశ్రేష్ఠి హృదయమిప్పటికి స్వస్థతనందినది. (ఆలోచించి) మన సుశీల, గౌరీదేవి నారాధించుటకు వచ్చియుండెనో? లేదో? (ఆకసమునకుఁ జెవియొగ్గి) ఏమీ? సుశీల చెలికత్తియ కంఠస్వరమా వినవచ్చుచున్నది? యేమనెదవు? నేనును సుశీలయు నిప్పుడే, దేవి నారాధించి నివాసమునకుఁ జనుచున్నాము; నారదమహర్షి గారును, వచ్చుచున్నట్లున్నది; మీరును రావలయుననియా? మంచిది. ఇదే వచ్చుచున్నాఁడను. (వైశ్యులఁ దిలకించి) బాంధవులారా! నేను మరలవచ్చెదను. మీరిందుండుఁడు. (నిష్క్రమించును.)

ఇది, శుద్ధవిష్కంభము.

ప్రవేశము; నారదుఁడు.

సీ॥ ఏదేవి కరుణార్ద్ర - దృష్టిచే లోకంబు
లన్నియు సౌఖ్యంబు - నందుచుండు?
నేదేవి దివ్య ప్ర - సాదంబుచే భక్త
హృదయాభిలాష ఫ - లించుచుండు?
నేదేవి చరితాను - మోదంబుచే దుఃఖ
సంచయ మెడఁబాసి - చనుచునుండు?
నేదేవికారుణ్య స - మీక్షణచే దుష్ట
కృత్యంబులెల్ల హ - రించుచుండు?

తే॥గీ॥ నా మహాదేవి, సకల లో-కైకమాత,
యక్షరత్రియ రూపిణి,-యాదిశక్తి,
పరమపావని, భయతమో-హరణ తరణి,
గానఁబడు నేఁడు, కన్నుల-కఱవుదీర. ||

[దేవీభవనములోనికిఁ బోఁబోవును.]

ద్వారపాలకులు—(ద్వారమున కడ్డునిలిచి) మునీంద్రా! కొంచెమాఁగుఁడు. ఇప్పుడే, దేవికి నివేదన జరిగినది. కొంతకాలము లోనికిఁ బోఁగూడదు.

నార—(పరిహాసముగ) ఎంతటి మూర్ఖత్వము? ఆమెకేని స్థలమెద్ది? యీభవనమునవే యున్నదనియు, మీరే, యామె ద్వారమును గాచికొనియున్నవారనియు, భావించితిరా?

ఒకఁడు—మాకిది నిత్యకృత్యము. సెలవేర్పకుండుట ధర్మమగునా?

నార—మావంటివారి నడ్డగించుటయా? మీకృత్యము.

మఱియొకఁడు—మీవంటివారనిన నెట్టివారు? కల్లబొల్లి మాటలనువచించి, యొకనిజుట్టు నకును, మఱియొకని గడ్డమునకును ముడివెట్టువారనియా?

ఇంకొకఁడు—మనకు గౌరీశంకరులసేవ, యెట్లు నిత్యకృత్యమో? వారికట్లే యవియు నిత్యకృత్యములు.

నాగ—(తనలో) వీరికి శనిగ్రహము ద్వాదశమునఁ బ్రవేశించినట్లున్నది; ముల్లోకములలో నన్నుల్లంఘించినవారులేరు. (ప్రకా) మంచిమాటలతోఁ ద్రోవనిచ్చెదరా? లేక, కష్టమునను భవించుటకు సిద్ధపడియుండెదరా?

వైశ్య—దేవీకటాక్షమొక్కటియుండినఁ గష్టములు మమ్మేమిచేయఁగలవు? కొంచెము సేపు నిదానించుఁడనిన, మీకింత యాత్రమెందులకు?

నాగ—మీవంశమే, యిటనుండుట కనర్హమైనది, నేను వచ్చినప్పటినుండియు, గౌరవమును బాటింపకుండుటయేగాక, నాకు నడ్డునిలిచెదరా? (కోపముతో)

తే॥గీ॥ వైశ్యులగు మీర లెల్లరు-వసుధయందు
జన్మమునుబొంది, దుఃఖభా-జనములైన
విషయములలోఁ దగుల్కొని,-వేదవిద్య
కెనయు, దూరులుగాఁ జరి-యింతురిగాత! ||

ఈశ్వరునిటకుఁ దోడ్కొనివచ్చి, మిమ్మిప్పుడే యిటనుండి వెడలఁగొట్టించెదఁ జూడుఁడు. నారదుని సామర్థ్యమప్పుడు తెలియఁగలదు. (నిష్క్రమించును.)

ప్రవేశము; శంభుశ్రేష్ఠి.

శంభు—(ఆత్రముగా) అయ్యో! ఏమిప్రళయమాసన్నమైనది? (వైశ్యులఁదిలకించి) బాంధవులారా! మీరు, నాగదమహర్షులవారి కేట్టిద్రోహమొనర్చితిరి? నేనెంత బ్రతిమాలినను వినక, యతితీక్ష్ణభావముతో నెటకో, వెడలిపోయె కారణమేమి?

వైశ్య—దేవీభవనములోని కతఁడు పోఁబోవ, నిది సమయముగాదని యంటిమి. అందులకతఁడు కోపావేశముతో మీరిటనుండఁదగరు; ఈశ్వరునిఁ బిలుచుకొని వచ్చి, క్షణకాలములో వెడలఁగొట్టించెదనని చెప్పి, వైశ్యులెల్లరు భూమియందుఁబుట్టి వేదవిద్యకనర్హులై దుఃఖము ననుభవింతురిగాత మని శాపమొసఁగి వెడలిపోయె.

శంభు—(నిట్టూర్పుతో) కార్యము చెడినది. ఇంతకుముందే మన సేవకుఁడగు మృగవ్యాఘ్రుఁడును బూవులఁగోయుచుఁ బొదలోనున్న భృగుమహర్షి నెఱుఁగక, యాతని నెత్తిపైఁ గాలిడెనఁట; వానికతఁడు "భూమియందుఁబుట్టి యగ్నిలో దహింపఁబడుదువు" అని శాపమొసఁగి ఖిన్నతనందఁ జేసెనఁట; ఇప్పుడు మీవలన నిట్టిచెట్టయు నొనఁగూడె; నిఁకేదిగతి? (ఆలోచించుచుండును.)

ప్రి; ఈశ్వరుఁడు. నారదుఁడు.

ఈశ్వ—(వైశ్యశూద్రులఁజూచి) ఔరా! యెంతటి మదోన్మత్తులైతిరి? మీరా? యీనారద మహర్షిని బ్రిల్లదములాడిన దుర్మతులు? మీకాశ్రయ మొసఁగినందులకు నాదియే, పొరపాటు. తుదకు, భక్తాదులను మమ్ముఁజూచుటకును మీయాజ్ఞ కావలసివచ్చినది; భక్తుల మనస్సు నేవిధముగ బాధనందఁ జేసినను నేను సైఁచు వాఁడనుగాను. వారొందిన పరాభవముగాని ప్రాభవముగాని నాయదియ. ఇఁక మీరిచ్చట క్షణకాలముకూడ నుండఁగూడదు. ఈ ముని శాపోక్తి ప్రకారము భూమియందు జనింపుఁడు; కష్టముగాని సౌఖ్యముగాని యందే యనుభ వింపుఁడు; కైలాసాది దేవలోకములకు స్వేచ్ఛగా నరుదెంచు శక్తి మీకు లేకుండుఁ గాత! నాకీనాఁడు క్రోధమును గల్గించుపని నొనర్చితిరి కావున, నాసన్నిధినుండి తొలఁగిపో నాజ్ఞయొసంగితిని.

వైశ్య—మహానుభావా! శరణందితిమి; మా నేరములు మన్నింపవలయు; దీనులమగు మమ్ముద్ధరింపవలయు. (పాదములపైఁబడుదురు.)

ఈశ్వ—లెండు; లెండు; గర్వముచే మీరెవరినుదాసీనమగు పలుకులఁ బల్కితిరో? వారిని శరణుపొందుఁడు. రక్షించినను, శిక్షించినను, వారే బాధ్యులు.

వైశ్య—దేవా! మీయాజ్ఞానుసార మొనర్తుము. నిరాదరణముఁ జూపిన, మాగతి యేమి? (ఎల్లరును నారదుని పాదములపైఁబడి) మహాత్మా! మమ్ము రక్షింప వలయును.

నార—త్రోవయొసఁగుటకే తగని యీనారదుఁడిప్పుడు కావలసివచ్చెనా? సమయాను సారముగ యుక్తిప్రత్యుక్తులఁ బన్నుటకు మీవైశ్యగణమువారే సమర్థులు. తృణముకంటెను స్వల్పముగాఁ గాన్పించిన నారదుఁడు నమస్కారముల కర్హుఁ డెట్లగును? పెద్దలగు మీరే, మావంటివారలను రక్షింపవలయు.

(పాదములు వదలించుకొని దూరము నిల్చును.)

శంభు—మహాత్మా! మీమహత్వము తెలియక మావారొనర్చిన నేరమునుసైఁచి, మమ్ముఁ గృతార్థులఁ జేయుఁడు. దయామయులగు మీకిట్టి పట్టుదలయేల? నాకు మీపైఁగల భక్తివిశ్వాసములు మీరిదివఱకెఱిఁగియే యున్నారు. నామాట లాలకించి, తరణోపాయమును గలుగఁజేయుఁడు.

నార—శంభుశ్రేష్ఠీ! యాదినుండియు నీవు భక్తాగ్రేసరుఁడవే; సందియమే లేదు. హఠాత్తుగ నన్ను మీవారుల్లంఘించుటయు, నానోట శాపోక్తులు వెడలు

టయు, సంభవించినది. అయినను, నీప్రార్థన మంగీకరించితిని. శివసేవా ధురీణులైమనిన మీకీ నాఁటికి భూలోకావాసులు కావలసివచ్చినది. కాని, నీవును నీకు సంబంధించినవారలును మాత్రము కొంతకాలమటనుండి, తుదకు దేవీ కరుణకుఁబాత్రులై యామెసాయుజ్యమును బొందఁగలరు. మీగోత్రముల వారికీర్తియుఁ జిరస్థాయి కాఁగలదు.

శంభు—మిగిలినవారిగతియేమి? సెలవొసంగుఁడు.

నార—నీకు సంబంధములగు గోత్రములువారు తప్ప, నితరులెల్లరు ముందు దుర్వాసో ముని యొసఁగియుండిన శాపమునకు బద్ధులై వంశదూరులగుదురు. వాణిజ్య లాభమే ప్రాముఖ్యముగా నెంచి భగవదారాధనమునకుఁ బాల్పడక యెల్లచోఁ దిరుగాడుచు భక్తి శూన్యులయియున్నవారి కదియేగతి.

శంభు—(ఈశ్వరునిఁగాంచి) మహేశ్వరా! మీసాన్నిధ్యమును విడిచియుండఁజాలము. భూలోకమున మాకుఁ బ్రాపెవరు? మాకీయెడఁబాటు నింతయాతురముగఁ గల్పింపక క్షమింపఁ బ్రార్థించెద.

ఈశ్వ—నాకుఁ గ్రోధము జనించు కార్యమేనాఁడు మీవలనఁగలుగునో? అప్పుడే నా నివాసమున నుండఁజాలరని ముందే వచించితిని. ఇఁకదానికిఁ బ్రతిలేదు. మీ కర్మానుభవమిట్లున్నది.

నార—శంభుశ్రేష్ఠీ! మీరొక్క దివ్యసంవత్సరము మాత్రము, గోగర్భమునుండి, యావులఁ గుడిచెవినుండి పురుషులును నెడమచెవినుండి స్త్రీలును జనించి భూమినిఁ జేరుదురు. గోముఖులన సుప్రసిద్ధిని వహింతురు. భవిష్యద్వర్తన మిదియే యని యెఱుఁగుము.

శంభు—చిత్తము. మీవాక్యానుసారము జరుగక మానునా? ప్రగల్భములాడిన మావారలేమి మాటలాడుటకును దోఁపక నిర్విణ్ణులైయుండిరి. మహేశ్వర సాన్నిధ్యమునకు దూరులై మేమీభూలోకమున నెట్లుందుము?

నార—పరమేశ్వరా! యీతని మొఱలాలకింపవలయును. సదుపాయమును యోజించి మీసేవకుఁడగు నితని కభయ మొసఁగుఁడు.

ఈశ్వ—శంభుశ్రేష్ఠీ! నీయవిచ్ఛిన్నానురాగమునకు నచ్చెరువయ్యెడు. కనుక, మీరు భూలోకమున నివసించినను, మిమ్ములను రక్షించుటకు నాయంశమున నగరేశ్వరుఁడును, పార్వతియంశమున వింధ్యవాసినియు, విష్ణ్వంశమున జనార్దనుఁడును, మహాలక్ష్మ్యంశమునఁ గోనకమలయు జనించి పూజనీయులై యుందురు.

మఱియు బ్రహ్మాంశసంభూతుఁడై భాస్కరాచార్యుఁడను బ్రాహ్మణుఁడు మీ కులగురుఁడై సముచిత ధర్మముల నెఱిఁగింపుచుఁ గార్యనిర్వహణ మొనర్చుచుండు. నీసందేహము లిఁక నేమిగలవు?

శంభు—(కరములు మొగిడ్చి) దేవదేవా!

శా॥ సందేహంబులు లేవు మాకునిట మీ-సాన్నిధ్యముల్ వీడు లే
సందేహంబున కాస్పదంబు; భువిలో-జన్మించి కష్టంబులం
బొందన్ మాకొనఁగూడె, నైనఁగరుణా-స్ఫూర్తిందగన్ మీరలా
నందంబొప్పఁగ స్వాంశ జన్మలయి చెం-తన్ నిల్చినం జాలదే? ||

ఈశ్వ—నాయానతి మేరకుఁ దప్పక జరుగఁగలదు. (వైశ్యర్షులఁజూచి) వైశ్యర్షులారా! మీకీ భక్తాగ్రేసరుని సాహాయ్యముననే శ్రేయమునందుదురు. ఇఁకనుండి మీ గర్వమును మానుఁడు.

వైశ్య—పరమేశ్వరా! కృతార్థుల నొనర్చితిరి. మాయవివేకమును రూపుమాపితిరి. (నమస్కరింతురు.)

ఈశ్వ—మంచిది. (నారదునుద్దేశించి) మునీంద్రా! మనమిఁక వెడలుదమురమ్ము.

నార—చిత్తము. దయసేయుఁడు. (ఇరువురును నిష్క్రమింతురు.)

శంభు—మునులారా! జగన్మాతయగు దేవికి మనవిషయముల నెఱిఁగించి, యామె యనుజ్ఞవడయుదము.

వైశ్య—నీయిష్టమెట్టులో? అదేరీతిఁ గావించుటను సంసిద్ధులమైయున్నాము.

శంభు—అట్లయినఁ బరమపావనియగు నామెను ధ్యానించుటకంటె వేఱుమార్గములేదు. (కరములు మొగిడ్చి)

శా॥ తల్లీ! శాంకరి! నీకృపామహిమచే-తన్ సౌఖ్యముంగన్న, నా
యుల్లంబిప్పుడు తల్లడిల్లెడిని; నా-కొక్కింత ధైర్యంబు సం
ధిల్లంజేయుము; కోర్కెఁదీర్పుము; భవా-నీ! దీన సంజీవనీ!
ఫుల్లాంభోజ వికాసభాసురముఖీ!-పుణ్యాను సంధాయినీ! ||

మఱియొకఁడు—

ఉ॥ అన్నియు నేరముల్ సలిపి-నట్టి జడుండును; బాపచిత్తుఁడన్;
మన్నన సేయఁగావలయు-మంజులమైన త్వదీయ ప్రేమచే;
ఖిన్నతఁ బాపవేఁడెదను;-కీర్తికళాపరిపూర్ణ దీప్తటీ!
సన్నత పాదపంకజ! ప్రశస్త దయానిధి! శ్రీమహేశ్వరీ! ॥

వేఱొకఁడు—లోకమాతా! యనవరతము నీపదారవిందముల సేవించు మేమిప్పుడు భూలోకమున కేగవలసివచ్చినది. తల్లిలేనిబిడ్డలగతి మమ్మొనర్పకుము. అభయ మొసఁగుము. రమ్మా. నీ సందర్శనభాగ్యమును లభింపఁజేయుము.

ఇంకొకఁడు—జగదీశ్వరీ!

తే॥గీ॥ నిర్మలంబైననీకృపా - నీరములను
గోరిలి, జీవించునట్టి భ - క్తాళియిటుల,
దీనదశనంద నశ్రద్ధ - పూననౌనె?
వేగరమ్మిఁక మాదగు - భీతి తొలఁగ; ॥

[భవనములోనుండి, పార్వతీదేవి యేతెంచి, వారి యెదుటనిల్చి]

పార్వ—భక్తులగు మీకభయమొసఁగితిని. మీనిశ్చల స్వభావమునకు మెచ్చితిని. మీకే కోర్కులువలసినను, సందియములేక యొసఁగెద. వచియింపుఁడు.

ఒకడు—తల్లీ! మేమీకైలాసమును వీడి భూమినిఁజేరఁ బరమేశ్వరు నాజ్ఞయైనది. తమ దర్శనమునకైవచ్చిన నారదమహర్షిని సయమముకాదని మాతెలివి తక్కువచే నిరాకరించితిమి. అతఁడు, మాకు నెల్లగకు, భూమిపైఁ బుట్టునట్లును, వేదవిద్య నభ్యసింపకుండునట్లును, శాపమొసఁగి, యీశ్వరునికడకేగి లేని క్రోధమును మాపైఁ గలుగఁజేసి వెంటనే వెడలిపోవలయునని యాజ్ఞయిడునట్లొనర్చె. పాలముంచినను, నీటముంచినను, మీకంటె నితరములేదు. రక్షింపవలయును. (నమస్కరించును.)

మఱియొకఁడు—మాతా? భూలోకమున మేమెచ్చోట నివసించుచుందుము? మాకచట జీవనాధారమేదికలదు? తుదకు మాగతియేమి? దిక్కుదోఁపక పరితపించుచున్న మమ్ముద్ధరింపఁ బ్రార్థించెద!

వేటోకఁడు—అమ్మా! ముందు చిత్రకంఠుఁడను గంధర్వుఁడీ శంభుశ్రేష్ఠియు, నితని సంబంధులగు మేమును నగ్నిలోఁ బడునట్లు శాపమొసఁగియుండెఁగదా? అందులకుఁ దరణోపాయమేమి? తెలియఁజేసి మమ్ములను గాపాడవలయు.

పార్వ—వైశ్యులారా! మీప్రార్థనము లంగీకరించితిని. భూలోకమున మీరు నివసించుటకు బ్రహ్మదేవుని కరుణచేఁ బదునెన్మిది పట్టణములు నిర్మింపఁబడు. వానిలోఁ దలమానికమగు పెనుగొండయందున మీరు వసించునట్లును, మీ సుఖమునకై వలసినంత ధనకనకాదులనిడి కుబేరుఁడు మిమ్ము సదా కాపాడునట్లును, నేను వరమొసఁగితిని. మఱియుఁ జిత్రకంఠుఁడు సహితము నాకుఁ బరమభక్తుఁడు. కారణాంతరములచేఁ బరస్పరశాపములిట్లు మీకొనఁగూడినవి. వాఁడును భూలోకమున రాజై జనించును. మీశాపానుభవదినముననే, యతని శాపమునకుఁ బరిణామమని తెలియుఁడు. నారదముని వచన మమోఘము. భూలోకమున మీరు వేదవిద్యకు దూరులై ప్రాకృత గోత్రములతో నుండక తప్పదు. కాని, కలియుగమున నైదువేలేండ్లకావల మీరు వేదవిద్యాభిమానులై వేదములభ్యసింపఁ బ్రారంభింతురు. ఇది నిశ్చయము.

శంభు—భగవతీ! యెన్నివచించినను, భూలోకముఁగాని మఱి యేలోకమునఁగాని, నీసాన్నిధ్యములేక జీవింపఁజాల; ముమ్మాటికి నిది నిక్కువము.

చ॥ ధన కనకాదులుండినను,-దండిగ బంధువులున్నఁ, గూఁతులుఁ
దనయులు కల్గినన్, బలువి-ధంబుల సౌధములున్న, మిత్రముల్
మునుకొనికొల్చుచుండినఁ, బ్ర-మోదమునించెడు భార్యయుండినన్,
దనకొకరైనఁ దోడ్పడరు;-దైవవిధానము కొంత తప్పినన్. ||

తే॥గీ॥ నిరుపమానంబు, నిత్యంబు,-నిర్మలంబు,
నిశ్చయంబు, నిరీహంబు,-నిశ్చలంబు,
నిఖిల సుఖదంబు, దివ్యము-నిప్రసేవ్య
మైన నీప్రాపుగనఁజేయు-వమ్మ! దేవి! ||

పార్వ—భక్తకులతిలకా! నీభావమును గుర్తెఱిఁగితిని. ఐనను, నైహికవిధానమునకు బద్ధుఁడవై కర్మశేషమును వదలించికొని, తుదకు నీ వాపదవినందుదువుగాక!

శంభు—జననీ! నేను భూలోకమున నుండువఱకు నీవును మాకుఁ దోడునీడవై యుండవలయునని ప్రార్థించెద. ఈకీచుని మన్నించి వరము నొసఁగవలయు.

పార్వ—ఎంతటి కోర్కెఁ గోరితివి? కానిమ్ము. భక్తాలాపము లాలకించుట నావిధి; నీహృదయోద్దేశ్యము నెఱింగితిని; భూలోకమున నీకుఁ బుత్త్రికనై జన్మించి, మీశాపములు చెల్లినవెనుక, మరల నాసన్నిధినిఁ జేర్చుకొనియెదను. కాని, భ్రాంతిజనకమైన యాలోకమున నన్నెవరునుఁ దెలియఁజాలరు. నాయందుఁ బ్రేమఁగలిగి, నాకై కష్టించువారు మాత్రము శుభమునందఁజాలుదురు. ఇంతకంటె మీకు వచింపవలసిన దేదియు లేదు.

శంభు—మహాప్రసాదము. ధన్యుఁడనైతిని. (నమస్కరించును.)

వైశ్య—దేవీ! తమ యాజ్ఞానుసారము మేమును వర్తించెదము. శంభుశ్రేష్ఠితోపాటు మాకును, నీసాన్నిధ్య మొసఁగవలయు.

పార్వ—అట్టులే యగుఁగాక! మీరిఁక జరుగఁబోవు విషయముల ననుసరింపుఁడు.

(నిష్క్రమించును)

[ అందఱును భక్తితో దేవీభజన మొనర్తురు. ]

జయ! జయ! భక్త వి - చారణశీలా!
జయ! జయ! సద్గుణ - జనపరిపాలా!
జయ! జయ! కవితా! - సారవిలోలా!
జయ! జయ! ధృతమణి - చయసుమమాలా! ॥జయ॥

జయ! జయ! సింహా - సనసంసీనా!
జయ! జయ! మునిసం - స్తవ్యాధీనా!
జయ! జయ! సంతత - జగదభిమానా!
జయ! జయ! స్వర్గే - శ్వర సన్మానా! ॥జయ॥

జయ! జయ! నిర్మల - చారుశరీరా!
జయ! జయ! సత్యా - చార విచారా!
జయ! జయ! మానస - సద్మవిహారా!
జయ! జయ! కల్పిత - సర్వాధారా! ॥జయ॥

జయ! జయ! వైభవ - సంచయకర్త్రి!

జయ! జయ! దుర్మద - సంఘవిహర్త్రి!

జయ! జయ! పావన - జనసంభర్త్రి!

జయ! జయ! విజయా - స్పద పదభోక్త్రి! ॥జయ॥

(నిష్క్రమింతురు. తెరవాలును.)



# వాసవీ విలాసము.

## పంచమాంకము.

(పద్మశైలపురమున విష్ణువర్ధనుని మందిరము.)

[విష్ణువర్ధన మహారాజు సింహాసనాసీనుఁడైయుండును. విజయసింహుఁడును, సుమార కంఠీరవుఁడును, నిరుదెసల, నుచితాసనములపై నుందురు. సేవకుఁ డొకపక్కన నిల్చియుండును.]

(వేశ్యయొకతెవచ్చి, నాట్యకళాకౌశలమును సానురాగముగఁ జూపి, నిష్క్రమించును.)

విష్ణు — మంత్రివరులారా! ప్రజాసౌకర్యమునకై వలసిన పనులఁ జేయింపుచు, మద్యపాన పరధనకాంతాపహరణాది దుర్వృత్తుల నొనర్చువారినిగనిపెట్టి, తగిన రీతుల దండించి, వారించుచుఁ బరిపాలనాస్థితియం దేలోటుపాటును లేకుండునట్లు సజ్జనులఁ బోషింపఁదగు ప్రయత్నములు సల్పుచుంటిరా?

విజ — మహాప్రభూ!

ఉ॥ పిల్లలఁబోలె నెల్లరను-బ్రీతిమెయింగని, దుష్టవర్తనుల్
తల్లడిల్లంగఁజేసి తమ-ధర్మముఁ దప్పకయుండువారిపైఁ
జల్లని చూడ్కులం బఱపి,-క్ష్మారమ, నారఘురామునట్లు మీ
రుల్లసమొప్పఁ బ్రోచెదర-హో! యిఁక నెయ్యది లోటుకల్గెడిన్?॥

ఏమానవుని నోట వెలువడినను, మీరు ధర్మమూర్తులనియు మీతోపాటు రాజ్యపరిపాలన మొనర్చువారు లేరనియుఁదప్ప, వేఱువిధమగు మాటయే రాకున్నది.

సుమా — మహీరమణా! పరరాజులు మీనామమును విన్నంతనే, వీతధైర్యులై, మణిభూషణాదులఁ గైకొని మీపాదాక్రాంతులుగా, నూహించుచుందురు. బ్రాహ్మణులు సుఖముగ జీవించుచుందురు. మీసత్యరక్షణమునకై, దేవతలు సయితము మెచ్చెరువంది, రోగాధివ్యాధిబాధలు మనరాజ్యమునఁగలవారి నంటకుండఁజేసి

కొఱఁతలేని పాడిపంటలఁ బ్రసాదించుచుందురు. సంశయాస్పదములగు వర్తనలేవియుఁ గానరాకున్నవి.

విష్ణు—ధీవిశారదులగు మంత్రివర్యుల సాహాయ్యముచేఁగాదా? రాజ్యమునకును, రాజునకును, కీర్తివైభవములబ్బుట.

సుమ—

మ॥ చతురంభోధిపరీతభూవలయ ర-క్షాదక్షుఁడై నట్టి, భూ
పతి, సామ్రాజ్య రథంబునన్ వెలయు; ది-వ్యంబైన సారథ్య సం
గతికిన్ మంత్రిప్రధానుఁడై తనరుఁ; బ్ర-జ్ఞాయుక్తులౌ సైనికుల్
సతతం బారథమీడ్చు గుఱ్ఱములు; వి-శ్వంబందు యోజింపఁగన్

కావున, మహీపతి యనుగ్రహమే లేకుండిన, మంత్రులాదిసర్వజనులును నిశ్చేష్టితులు కదా?

విష్ణు—మంత్రీ! నీస్వామిభక్తికెంతయు నచ్చెరువయ్యెడిని.

తే॥గీ॥ కలరు. గురువంచకులు; ప్రభు-కార్యకరణ
శూన్యహృదయులు; దేవతా-స్తుతి రహితులు;
కులసతీ ధర్మనాశకుల్ ;-కలియుగమునఁ;
గోటి కొక్కండు, మిముఁబోలు-గుణయుతుండు. ||

( తెరలో; సత్యము-సత్యము. అని వినఁబడును. )

విష్ణు—సేవకా! యనుకూలభాషణము లాడినయాతఁ డెవఁడు? ద్వారము చెంతకేఁగి కనుఁగొని లోనికిఁ బ్రవేశపెట్టుము.

సేవ—చిత్తము. (నిష్క్రమించి, నారదమునితోఁ బ్రవేశించును.)

( విష్ణువర్ధనుఁడును, మంత్రులును లేచి, మునికి నమస్కరింతురు. )

నార—విజయోస్తు! విజయోస్తు!!

విష్ణు—దేవా! మీరీపీఠము నలంకరింపుఁడు. (సింహాసనముఁ జూపును.)

నార—(సింహాసనాసీనుఁడై) రాజా! నీవును నిందుఁగూర్చుండుము.
మంత్రులారా! మీస్థానముల, మీరునుఁ గూర్చుండుఁడు.

(ఎల్లరును పీఠములపై నాసీనులవుదురు.)

విష్ణు—మహాత్మా! సత్యమని వాకొనినవారిలు మీరలేకదా!

నార—ఔను. నీవచించుచుండిన విషయములను గన్నులారఁజూచితిని; గొన్నియెడల ననుభవించితిని; ముమ్మాటికిని నవి సత్యములే.

విష్ణు—మునిచంద్రమా! మీరెఱుఁగని సత్యాసత్యములుండునా? సృష్టికార్య నిర్వాహణుఁడగు విధాతకు, మానసపుత్త్రులైన మీకు సర్వమును వేద్యమే; దయయుంచి నారాజ్యమునఁగల వారెవ్వియైన దుష్కృతులఁ జల్పుచుండిన వచియింపుఁడు. వెంటనే, యట్టివారిని దండనార్హులఁ గావించెద.

నార—(చిఱునగవుః) పోరాటములు పెంచువాఁడనని యిప్పటికే, నాపేరు ముల్లోకముల నిండినది. సత్యవాదులిప్పుడు పనికిరారు. మీరాజ్యమున నెట్టివారుండిన నాకేమి? లేనిపోని ప్రసంగములకు, నామనమంగీకరింపదు.

విజ—మహాత్మా! మిమ్ములను నిందించుటకు సాహసించినవాఁడెవఁడైన సరియే; శీఘ్రముగ మృత్యుదర్శనమునకుఁ బాత్రుఁడగును. వచింపుఁడు.

నార—మంత్రీ! తొందరపడవలదు. ఎవరేమనుకొనినను, నాకుమాత్ర మొక్కఁడైన శత్రువనువాఁడులేఁడు. యథార్థవాదియే, లోకవిరోధికదా?

తే॥గీ॥ కుక్కలన్నియు గుమిగూడి - యుక్కుమిగిలి
కుంజరేంద్రునిఁగని బిట్టు - కూయుఁగాక!
అదిచలించునే? యిసుమంత - యైనఁగాని;
కదలెఁబో! కుక్కలప్పుడే - చెదరకున్నె? ॥

కుమా—(విజయసింహునుద్దేశించి) మిత్రమా! యెవఁడో నీచుఁడీమహాత్మునిఁ దృణీకారభావమునఁ జూచెనని వ్యక్తమగుచున్నది.

విజ—ఎవఁడైననేమి? వారి యాజ్ఞయైనచోఁ గర్తవ్యమూహించుటకు మనము సంసిద్ధులము.

విష్ణు—మహాత్మా! విషయమును గుప్తపఱచెదరేల? మీవాక్యము నెఱవేర్పఁ గంకణము ధరించియున్నాఁడ.

నార—మహారాజా! మీరిందఱు నిర్బంధించుటచే విధిలేక నావిషయము వెల్లడించెద; నయినను, మీరాత్రమునందవలదు. (తనలో) సమయము కుదిరినది. మా తండ్రి కలహాశనుఁడని నాకే లగ్నమునఁ బేరిడెనో? కాని, యేనాఁడు రవంత

చివ్వలేకపోయినను, గముపు దరికొనుచుందును. పాత్రలను నిర్ధారించితిని. కథా సంవిధానమును యోజించితిని. నాందియైనది. ప్రస్తావనతో నా సూత్రధార పాత్రమును నిష్క్రమింపఁజేసి, జరుగఁదగిన భూలోకనాటకము నాడించెద. పిమ్మట భూరిభోజనములతో సుఖించెద. నాకుఁ బేరిడిన బ్రహ్మదేవునే యచ్చెరువందఁజేసెద. (యోజించుచుండును.)

విష్ణు—మునీశ్వరా! సంశయించెదరేమి? లోలోన 'గుక్కిళులు' మ్రింగుచుంటిరి. వచింపవలసిన విషయమంతటి దుర్భరమైనది కాఁబోలు?

నార—విషయమెట్టిదయినను, ముందు వెనుకలాలోచించియే చెప్పవలెనందును. సావధానముగ వినిపించెదను. మీచిత్తమువచ్చినరీతి నొనర్పుఁడు.

విష్ణు—కానిండు. వృత్తాంతమెఱిఁగింపుఁడు.

నార—

చ॥ ఒకఁడననేల? రాజ్యమున-నుండిన యల్పపురాజులెల్లఁ దా
పకవిభవంబుఁ గాంచి, యని-వారిత ధైర్యగుణుండటంచు, మా
మక సదృశాదులందఱభి-మానముగా, నిను నెంతుమంచు, నై
తిక విధిమాని, మోసపుగ-తిన్ నినుఁ గూల్పఁదలంతురెప్పుడున్॥

నీ శ్రేయమును గోరువాఁడనగుటచే, నెంతమాత్రమును సహింపనోపక యీదురాత్ములకపుడపుడు బుద్ధిగఱపుచుందును. కాని, వారు నామాటలఁ బెడచెవినిడి నన్నును నిన్నును నిందించుట కారంభించిరి. నన్ను నిందించినను బంధించినను నాకేమియుఁ గోపముగాని లోపముగాని లేదు. నీకులోఁబడి కప్పము లొప్పఁజెప్పఁదగిన యీనీచులు గర్వగ్రంథులై మహారాజగు నీకు, ద్రోహము తలఁచుటయు నిందించుటయు సహనము నొసఁగనివి. అప్పటినుండియు నా యెడ లుడుకు చెందినది.

కుమా—(విష్ణువర్ధను నుద్దేశించి) సార్వభౌమా! వింటిరికదా? ఈమహాముని వచనములు; స్వామిద్రోహపరాయణులయి వంచన ననుసరించినయీదురాత్ముల నిప్పుడే ఖండించి, యితర మాలోచింపవలయు.

విష్ణు—మంత్రీ! యొరులమనస్సు లెఱుంగుటకాత్రము ముఖ్యముకాదు. వారివంచన కనువైన యోజన సేయుట, సమంజసము.

విజ — మహారాజా! దుర్మార్గులకడ, యోజనలెందులకు? వారు వంచకులయిన, మనమును వంచనచే సాధింపవలెనా? మనకామోసపువర్తనము భావ్యమా? క్షత్రధర్మమును విడనాడనగునా? సంరంభముగా విజయయాత్ర సాగింపవలయు. దిగంతములను సుయశోవంతములఁ జేయవలయు.

నార — విజయసింహా! నీ నామమునకుఁ దగినమాటలాడితివి. సెబాస్. నీవంటివాఁడే మంత్రిపదవికర్హుఁడు.

విజ — దేవా! యంతయు మీ యాశీర్వాదప్రభావము.

నార — (రాజునుజూచి) భూపాలుఁడేమియో? యాలోచింపఁ దలఁచి నట్లున్నది?

విష్ణు — మహాత్మా! మీ యభిప్రాయములను, వ్యతిరిక్తముగఁ దలంచుటలేదు. నేను మంత్రియుక్తుఁడనై పరివారజనముతో విజయయాత్రకుఁబోవ, రాజ్యభార మెవరు వహింపఁగలరు? అంతఃపురరక్షణమునకు మార్గమెద్ది? యని, యోజించెద.

నార — (నవ్వుచు) గొప్పసందియము కలిగినదే? నీసంశయము ప్రత్యక్షమునకుఁ బ్రమాణము గోరినట్లున్నది.

విష్ణు — దేవా! నాకేమియు, బోధపడుటలేదు.

నార — బోధపడుటలేదా? సకలక్షమాభరణచతురుండును, బ్రజ్ఞాన్వితుఁడునగు నీసుతుఁ డుండ, నితరులకై యోజింపవలెనా?

సుమా — సమయమునకుఁ దగినట్లు జ్ఞప్తిపఱచితిరి. నిక్కముగ నారాజరాజేంద్రుఁ డంతటివాఁడే; ప్రభువుగారికిఁక సందియ మక్కఱలేదు.

విష్ణు — సుమారకంఠీరవా! చిన్ననాఁటినుండియు నాటపాటలతోఁ బ్రొద్దుపుచ్చుచుండినసుకుమారుఁ డీరాజ్యభారవహనార్హుఁ డగునా? యిదేటిమాట?

సుమా — దేవా!

తే॥గీ॥ మీకుఁగల యట్టి ప్రేమాతి-రేక మిట్టు
లతఁడశక్తుఁడుగాఁ దోఁచు-నట్లొనర్చె;
నంతియేగాని, నిక్కమూ-హింత మన్న,
నివురుచేఁ గప్పఁబడినట్టి-నిప్పతండు. ||

నార — నాకంతమాత్రము తెలియకయే వచించితినా? వారికెట్లో వారికానందమైనది

విజ — ప్రభువర్యా! తమకొమారు నిటకుఁ బిలువనంపుఁడు. మన యూహలకన్నింటి

కిని మార్గమగపడును. విజయయాత్రె వెడలనిచో, సామంతరాజు లొక్కటై మనల నేరీతిగ వంచించి యంతమందింతురో? దురభిప్రాయులకుఁ జేయరాని పనియుండదు.

విష్ణు—సేవకా! రాజరాజేంద్రు నిచటికిఁ బంపి, వెంటనే నీవంతఃపురమునకేగి, నారద మునీంద్రులరాక నెఱింగించి యాతిథ్యమునకు సిద్ధపఱపవలయు నని నామాటగా వచింపుము. పొమ్ము.

సేవ—మహాప్రభూ! చిత్తము. (నిష్క్రమించును.)

కుమా—(తనలో) ఔరా! చిత్రము? సామంతరాజశ్వానములు తుదకు దుర్మదేభేంద్రములుగా, నుంకించెనా? కాలగతి కాఁబోలు? కాదు. కాదు. సకల దిగంతవ్యాప్తజయపతాకుఁడగు, మావిష్ణువర్ధనమహీపాలుని క్రోధాగ్నిజ్వాలలకు గుఱియై, భస్మమగుట కిల్లెంచిరి. ఓ దురాత్ములారా! మీయాయువులు సమీపించినవని తెలియక, దురూహలొనర్ప సాహసించుట కచ్చెరువయ్యెడి;

(తల పంకించి యూరకుండును.)

విజ—మునిచంద్రమా! మీయాశీర్వచనశక్తిచే, వంచకులగు దుష్టులసంచయమును గొంత కాలముననే రూపుమాయించెదము. అప్పుడుకదా? మీకును, మాకును, సంతృప్తి కలుగుట.

నార—అటుగాక, మీధాటి కోర్వఁగల పురుషుఁడెవఁడు కలఁడు? మత్తేభయూథ ముపై మశకసమూహ మెదిరించినట్లగు నంతియే.

విష్ణు—(విచారముతో) మహాత్మా! ఘోరమగు సంసారభారము వహింప, నారితేరిన మహాధీరులకే సాధ్యముకాకుండునుగదా? నాపట్టియగు రాజరాజేంద్రుఁ డంతకంటె మించిన రాజ్యకార్యము నిర్వహించునా?

నార—(సాసూయముగా) నేనూరకుండినను నుండనీయక, వార్తలెఱింగింపుఁడని తొందరించితిరి. నాకే గొడవయెందులకని తడవొనర్చితి. అంతటితో విడువరైతిరి. మీనిర్బంధమునకై, యున్నవిషయము వచించితిని. తుదకు నావలన మీకేదియో? విచారము సంభవించినట్లాలోచించుచుఁ దహతహపడుచున్నారలు. ఇఁక నీప్రశంసలుమానుఁడు. మాయబ్బసొమ్మేమియు నష్టముకాలేదు. నీకొమారుఁడు రాజ్యభారమును వహింపను జాలఁడు. మీరు విజయయాత్రను జరపి శత్రునాశనముఁ జల్పజాలరు. నారదునకీ యపనిందలును వలదు. (లేవఁబోవును.)

విష్ణు—(నారదుని చేయిఁ బట్టుకొని) మునీంద్రా! మా శ్రేయమునకై వచించిన మీ మాటలు, వినరానివని నేనెంచలేదు. సుతుని పైఁగల ప్రేమ నన్నిట్లు సేయుచున్నది. (ప్రక్కకుఁజూచి) అదిగో! రాజరాజేంద్రుఁడును వచ్చుచున్నాఁడు. నేనుమాత్రము దుష్టులగు సామంతరాజులపై దయఁదలఁతునా?

(నారదుని చేయి వదలును.)

ప్రవేశము రాజరాజేంద్రుఁడు.

[తండ్రికిని, నారదునకును, నమస్కరించి నిలుచును.]

నార—సమస్త వైభవము లబ్బుఁగాత!

విష్ణు—(తనయునిఁ జేరఁదీసి) పట్టీ! యిటుఁ గూర్చుండుము. (ముద్దిడి)

చ|| గొనములప్రోవు, దుష్టజన-కుంజరసింహము, దీనసంచయా
వనఘనసత్కృపామతి, య-పారయశఃపరిపాలకుండు, పా
వనచరితాత్ముఁడున్, విమల-వంశనిధానుఁడు, భక్తియుక్తుఁడౌ
తనయునికంటె, వైభవవి-తానము సౌఖ్యము వేఱకల్గునే? ||

నాయనా! నిన్నొక కార్యమునకు నియోగింపఁదలఁచి, పిలిపించితిని.

రాజ—తండ్రీ! యదెట్టికార్యమైనను సరియే; మీయనుజ్ఞయైనమాత్రమున నెఱవేర్చి తీరుదును.

విష్ణు—బాలుఁడవగు నీవే కార్యమైన నెఱవేర్తువా?

రాజ-

తే||గీ|| పెద్దలగువారు దీవనల్ - ప్రియముతోడ
నిడఁగ; దైవసాహాయ్యంబు - నిరవుకొనఁగ;
హృదయమును ధైర్యదేవత - పదిలపఱుప;
ధర; నసాధ్యంపుఁ గార్యంబు - తనరఁబోదు. ||

అని, మహాత్ములవచనములుండుట యెఱుంగమా? మీయాజ్ఞయు, ననుమోదమును, నాకు సాహాయ్యములు.

విజ—దేవా! మా పాటలిపుడు యథార్థము లయినవికదా?

విష్ణు—భగవన్నియోగమున కన్నియు, ననుకూలించుచుండును

నార—మహారాజుగారి హృదయ మిప్పటికి స్థైర్యమందినది.

రాజ—తండ్రీ! నేనొనర్పఁదగు కార్యమేదియో? యనుజ్ఞనిండు.

విష్ణు—కుమారా! సామంతరాజులెల్లరును వంచించి, మనలను జయింప నెంచుచుండిరని, యీనారదమహర్షి గారు వచించిరి. అందునకు నేను మంత్రియుక్తుండనై పరివార జనముతో విజయయాత్ర వెడలి, వారి నణంచుట సమంజసమని తోఁచినది.

రాజ—ఆలసింపక యాదుర్మార్గులను నిర్మూలింప వలసినదే.

విష్ణు—బిడ్డా! మే మెప్పుడు విజయయాత్రకు వెడలుదుమో? అంతఃపురరక్షణమును, రాజ్యకార్యములను నిర్వహించుటయు నీకు విధింపవలసివచ్చినది.

రాజ—మీ యనుగ్రహమున, నిర్విరోధముగ నాపనుల నొనర్చుచుందును.

నార—మహీరమణా! నీవిఁక సందియపడుట సరికాదు. తగిన సన్నాహముఁ గూర్ప వలయు.

కుమా—ప్రభూ! ప్రయాణసౌకర్యమును నేను వెడలి సమకూర్చెదను. సెలవొసఁగుఁడు.

విష్ణు—సరే, నీవిఁక బయలుదేఱి తత్ప్రయత్నము గావింపుము.

కుమా—చిత్తము. (నిష్క్రమించును.)

రాజ—నాయనా! మీరు సేవకునిచేఁ జెప్పిపంపినరీతి, నంతఃపురమున, మహర్షులవారి కాతిథ్యము సిద్ధముగావింపఁబడినది.

విష్ణు—విజయసింహా! మునివర్యుల కాతిథ్యమొసఁగిన పిమ్మట మనప్రయాణమును గొనసాగింతము. లెండు. మనమందఱము నంతఃపురమునకరుగుదము.

(కుమారుని చేయిఁబట్టుకొని సింహాసనము దిగును.)

(విజయసింహుఁడును నారదుఁడును వెంట నడచుచుందురు.)

నార—(కొంచెము వెనుకను నిల్చి, తనలో) "ముందున్నది ముసళ్ళపండుగ" యనినట్లీ విజయయాత్ర నెపమున, నీరాజును దేశములు తిరుగఁజేసితిని. ఇతఁడు పెనుగొండకును బోకమానఁడు. పూర్వజన్మమునఁ బాస్పగము వైశ్యులకును నితనికినిఁ గల్గిన శాపములనుభవించుటకు సమయమిదియే; ప్రతాపవతీసోమదత్తులీ భూలోకమున జన్మించి, కుసుంభశ్రేష్ఠి, కుసుమాంబ, యను పేరులతోనున్నారు. పార్వతీదేవి వారలకుఁ గొమార్తయై వాసవీనామమున వెలయుచున్నది. కావున జరుగఁబోవు చిత్రములను గాంచుచు సంతసించెద. నాయూహ నెఱవేఱక మానునా?

(అందఱును నిష్క్రమింతురు. తెరవాలును.)

# వాసవీ విలాసము.

పంచమషష్ఠాంకముల మధ్యయందుఁ బ్రవేశకము.



[ పెనుగొండపురసమీపమందలి యుపవనము. ]

ప్రవేశము ఇరువురు సేవకులు.

( మద్యపానప్రమత్తులై యొకరినొకరు లాగికొనుచు. )

పాట.

1. ఎన్నోజనిమాలెత్తి పున్నాలు పుసిపింప - మొన్నాట సాగిందిరా!
సిన్నింగిటిగా! కన్నాకుదొరికిందిరా!

2. కన్నాకుగిన్నాకు మన్నైతె మనకేమి? -- కల్లేర కవిలాసము ;
కన్నూలుసెన్నా! కలిగింది మనకోషము ;

1. పెబువంటె పెబువంట్రు? బెమగానుసూస్తుంటె-పేణాలుబతికుంటురా!
సిన్నింగిటిగా! పెడసేస్తె సంపింటురా!

2. తబిసీలుపలుకొద్దు ; తాతంటివోళ్లంత-తకతయ్యలౌతారురా!
కన్నూలుసెన్నా! తలపగిలిపోతారురా!

1—ఏమోయ్! పెబువుగారి తల పగుల్తుందట్రా? నీకొవ్వుకొయ్య! వుండు. నీసావు తెలిపించకపోయేనా?

2—(మొదటివానిని విడిచి కొంచెము దూరముగ నిల్చి) అబ్బో! బాబూ! యెంతోడివయ్యావురా? నిన్నిపుడు గుంజకలాగేసిస్తే దిక్కెవ్వర్రా?

1—ఒరే, వొద్దు. యీసన్నాసిపలుకులు పలికావంటే, నీకత దగ్గరుంటుంది. తిన్నింటికి వాసాలు లెక్కపెట్టడఁవే?

2—నేనొకఁడికి భయపడ్డానంటే, కల్లోమాట; నిశావదేశాన్ని నీలిగించినోజయితే మాత్రం, నాదెబ్బకెరుకే.

1—దెబ్బలటా? దెబ్బలు. దెబ్బలిస్తే, బొబ్బరిస్తావు సూడు.

(రెండవవాని నొకగుద్దుగుద్దును.)

2—(నీల్గి, దిగువఁబడి లేచి,) నీతస్సగొయ్య! నీతోయుద్ధంచేశానంటే, నీయిల్లు, నీ పెళ్లాం, నీబిడ్డ, నీదొడ్డి, నీదబ్బు, నీవుబ్బు, నీయూరి, నీకీవి, అంతా గెలుచుకుంటానురా. (వ్రేలితో బెదరించును.)

1—ఓ నోయ్! యుద్ధమంటే వచ్చావటుకో! మారాజులు మారాజులంతా మాయమై పోతూంటె, మనమొక లెక్కటా? మనరాజు నీలాంటి యెట్టిమొగంకాఁబట్టే, తల్లకిందలబడి తల్లడిల్లి వచ్చాడు.

2—కాస్త కల్లుచ్చుకుంటె, కాగడాలెత్తి యెతికినా? నన్ను కాఁజేసేవాఁడుండఁడు. ఆవుపాయం మనరాజుకు దెల్సింటే, యిష్ఠగణ్ణి యీపాటికి చక్క బెట్టుకుండునటా?

1—పిచ్చిముండాకొడుకైనా, కాస్తమంచిమాటే చెప్పావురా! కల్లుమాత్యం తెలిసినోడికే తెల్సు.

2—అరే! మామా! బాబూ! నాయనా! బావా! నాపిల్లోడా! అలాచెప్పితే నీకాళ్లు బట్టుకోవచ్చు. పట్టు. పట్టు. పట్టు.

(మొదటివాని కాళ్లు గట్టిగాఁ బట్టకొనును.)

1—(రెండవవాని జుట్టుఁబట్టి పైకిలాగి) వరే. కోపంవచ్చి గుద్దెల్లపెట్టి నాపెళ్లాన్ని చూచానంటే, పాపం యిలాగే కాళ్లుపట్టుకుంటుందిరా! సామీ! సామీ! కొట్టొద్దు. తిట్టొద్దు. అంటుందిరా! నాదేముఁడా! అంటుందిరా.

2—ఎదవా! ఎదవా! నేను పెళ్లానటా? నేను నీపెళ్ళానైతే, కోకేదిరా? కొప్పేదిరా? శీకేదిరా? షోకేదిరా? గాజేదిరా? మోజేదిరా? వరే! యింకా కొన్నుండాలరా! అబ్బా! తల్సుకుంటే, నాకన్నులు తళుక్కుమని మూతపడ్డాయి.

1—రాజుల్ రాజులు సచ్చి దుమ్మైయినా. మనరాజ్యం దోసేవాఁడొకళ్ళేడీ? కల్లే, కవిలాసంలోవుండే అమృతం. కల్లు పాకాలే, అంతఃపుర్లు కల్లంగడుకులే, సిమాసనాలు కల్లుచెట్ల తోఁటలే, వుద్దానవాలు కల్లుతాగేవాఁడే, ఘనుఁడు. కల్లమ్మేవాఁడే, మారాజు. అంతాకల్లే. కల్లుమయం కలిగ్గాజ్జం.

2—ఓరి! నీ దుంపతెగా! వన్నిచ్చావుగందురా? కయీసుల్లో కలిసిపోతావురా!

1—నేను కయీసున్నో; నా కయిత్తం బాగుండదంటే, కాలిదెబ్బలే; చెప్పుదెబ్బలే; సెపుతానూడుమరి, కయిత్తమంటే గుమ్మయిపోవాల.

2—వరే! నీకయిత్తానికి నేను తాలమేస్తా నాట్యమాడ్తారా!

1—ఇదిగో! ఆఁ...... వరే! దండేశకల్లింపోతదరా? తప్పతాగి తిప్పతీర తొక్కి
నోళ్ళాలె తిరిగి తిరిగి మనమీ అడవిలో కొచ్చాము గదా?

2—కయిత్తం సెప్పరా! కంగారుపడ్డావంటే, నీ చెవులుగింగురు మనిపిస్తా.

(ఇరువురును నాట్యమాడుట కారంభింతురు)

పాట.

కల్లేరా! మనతల్లి ఆకల్లును దలతా మెల్లి. ఆ. ॥కల్లేరా॥
పిల్లల్, పెద్దల్, పెళ్ళాల్, గిళ్ళాల్, సల్లఁగబతికె
దొళ్ళాడేందుకు ॥కల్లేరా॥
తీగ్గావుండే టెంకాయకల్లు. తాగ్గావుండే తాటి
కల్లు. యింపై వుండే యీంతకల్లు ఎంతో సొగసౌ
యిప్పకల్లు. ॥కల్లేరా॥

(తెరలో, జయజయధ్వానములు భేరీవాద్యములు చెలరేఁగును. ఇరువురును నులికిపడి, నిలిచి, గట్టిగా నోరులు మూసికొందురు.)

(తెరలో)

సీ॥ అంగవంగకళింగ-మాదియౌ దేశముల్
మొదటిదిక్కున, జయ-స్ఫూర్తి గెలిచి;
చోళశకాదులౌ-క్షోణీపతుల నెల్ల
దక్షిణదిక్కున,-దర్పమడఁచి;
బర్బరకాంభోజ-పారసీకాదులఁ
బడమటిదిక్కునఁ-బరిభవించి;
పాంచాలకోసల-ప్రముఖదేశంబుల
నుత్తరదిక్కున,-నొగిజయించి;

తే|గీ| జయపతాకల, నాదిశ-స్థలులనిల్పి,
సద్యశస్కాంతులను వెద-జల్లి మిగుల;
విష్ణువర్ధనభూపతి-వెడలుచుండె,
జ్యేష్ఠశైలపురాంగనా-శ్రీవహింప,||

1—ఓరి! నా తిక్కకొండే! దండోస్తోందిరా. కాసిన్నిదాంగ దండాలెడ్తే, మాప్పబువు కల్లుకర్పు పుట్టుసేతపారేయఁడటోరి? యిలాంటి పిచ్చికూఁతలు, పిచ్చాటలు, ఆయనసూస్తే సంపేయుమంటాడా? రారా! పోదాము.

2—వరే! ఏందిరా? యెవ్వఁడో? జెట్టసయిలానికి పెబువెళ్తాడని మొత్తుకుంటాడు. ఆవ్వూరు నాకుసెప్పుతావుగందా?

1—ఏంతెలీనియెట్టిముండాకొడుకేరానీవు. దాపున్నేవుందిరా! పెనుగొండనేవూరు. దానికోపం వాఁడలా కొత్తపేరుతో మొత్తుకుంటావున్నాఁడనుకో.

2—అలాఅయితే యెల్దాంపదరా. మనకాయనే దేముఁడు. సిన్నసిన్నరాజులంతా, ఆయన మాత్త్యాన్ని సెలువునీళ్లుతాగి సెట్లపాలుపట్టారు. మన మింతోళ్లంగాని.

1—అదే, నాయిష్టంగూడా. రాగా! (ఇరువురు, నిష్క్రమింతురు)

(తెరలో)

ఓనరవరేణ్యులారా! వినుఁడు.

చ|| నిరుపమధైర్యసాహస వి-నీతగుణాన్వితమానసుండు, శ్రీ
హరకరుణావిశేష ఫలి-తాస్వహదీవ్యదభీష్టుఁడైన, మా
ధరణిపు, విష్ణువర్ధను, య-థావిధిఁగొల్వుఁడు; లేక మత్తులై
దురమున నిల్తురేని, బటు-దోర్బలశక్తినిమర్దించు మిమ్ములన్.

ఇది ప్రవేశకము.

---

# వాసవీ విలాసము.

## షష్ఠాంకము.

[ పెనుగొండపట్టణము ]

ప్రవేశము బాలనాగరులు.

ఒకఁడు—స్నేహితులారా! వచ్చెడువారు విష్ణువర్ధనభూపాలుఁడఁట; యేమివైభవ, మేమివైభవము? నేనెన్నఁడును నిట్టిమహాత్ముని గలనైనఁ జూచియుండలేదు.

మఱియొకఁడు—అతనిని సమర్యాదగ నెదుర్కొనకుండిన ముప్పువాటిల్లఁగలదని, ముందుగా నెవఁడో? వచించుచు వచ్చుచున్నాఁడు.

ఇంకొకఁడు—మన కాముప్పుతిప్పలెందునకు? పెద్దవారలకెఱుఁగఁజేయుదము. తగిన మర్యాదలను వారేయొనర్పఁగలరు.

వేఱొకఁడు—మంచియాలోచనఁ జెప్పితివిరా! మన పిల్లగుంపెదుటనుండిన, భటులతో రావడికలుగును త్వరగా వెడలుదము రండు. మనపెద్దవారు వచ్చునెడల వారివెనుకనే రావచ్చును. (నిష్క్రమింపఁబోవుదు.)

1 వాఁడు—కొంచెము నిలువుమురా! యదిగో! యాసమూహమంతయు నటనే నిల్చెఁగది. రాజుమాత్రము పాదచారియై యేతెంచుచున్నాఁడదెందులకు?

2 వాఁడు—రాజుమాత్రము కాదురా! యిరుప్రక్కల నెవరోవచ్చుచున్నారు. వారు మంత్రులేమో? యింకను నిద్దఱు తెల్లనివెండ్రుకల కుచ్చులు చేతఁబట్టుకొని వచ్చుచున్నారు.

3 వాఁడు—మనమీమాటలతో నిచ్చటనేయుండవలయును. వారు సమీపింపవలయును. తుదకేమిజరుగునో? తెలియవలయును మీయవివేకమిది. వారు నడచివచ్చిన మనకేమి? యెట్లువచ్చిన మనకేమి? తొందరగాఁబోయి మనవారికిఁదెల్పుదము.

4 వాఁడు—అబ్బో! నేనిఁకనుండను. వారు దగ్గఱకేవచ్చిరి.

(ఎల్లరును నిష్క్రమింతురు.)

[విష్ణువర్ధనుండును, నిరుగడలఁ జామరములు ధరించినవారును, విజయసింహుఁడును, గుమారకంఠీరవుఁడునుఁ బ్రవేశింతురు ]

విష్ణు—మంత్రులారా! యీపురము లంకారభరితమై నేత్రానందము గూర్చుచున్నది. అభినవాలకాపురంబు భాతి స్వర్ణమయమై రాజిల్లుచున్నది.

ఉ॥ ఈపురి సామ్యమైన పుర-మొందును నేనుజగానఁ గాన, న్నో
రా! పరిపూర్ణసంపదల-రంజిలుచుండెనటంచు సౌధముల్
దోఁపఁగఁజేయు; రత్నముల-తో విలసిల్లెడు కుందనంబు తోఁ
బ్రాపగుదివ్యహాటకలశ-పంక్తులఁదాల్చి యజస్రమీవిధిన్.

విజ—దేవా! సమస్తవైభవోపేతులగు మీకే యచ్చెరువొనఁగూర్చిన యీపట్టణరాజము స్తోత్రపాత్రము గాకమానునే?

కుమా—మహాప్రభూ! ధనాధిపతి తనపట్టణము పాత్రతవడియుండెని నవనిధులతో నిటకేతెంచి కాపురము సేయుచుండవలయును. లేకుండిన నిచ్చటి వైశ్యసత్తముల, భాగ్యము గణనాతీతమైయుండుట కడుదుస్తరము

విజ—మనరాకనెఱింగి, యింతవఱకును సగౌరవముగ నెదురొత్తువచ్చుచుండుట మాత్రమీ వైశ్యుల సంపద్వృత్తికి ముఖ్యము కాదు.

కుమా—మీరిట్లు తలంచుట పాడిగాదు. అదిగో! పుష్పహారములఁగైసేసి, సద్రాగద్రవ్యములఁ బళ్లెరములనునిడికొని యేతెంచెడు వైశ్యశ్రేష్ఠులను జూడుఁడు. స్త్రీజనము సైతము రాజదర్శనమునకై సౌధోపరిస్థలములకు వచ్చుచున్నారు.

(కొందఱు సువాసినులును, వాసవీకన్యయు, మేడలపైఁగన్పింతురు.)

[వైశ్యులు కొందఱును, కుసుమశ్రేష్ఠియు, బహుమానవస్తువులతోఁ బుష్పమాలలతో నరుదెంచి రాజును గౌరవింతురు.]

విష్ణు—వైశ్యవరులారా! మీసుగుణముల కానందించితిని.

వైశ్యులు—మహారాజా! మీకృపకుఁ బాత్రులగుటకంటె మాకు, వేఱేమి కావలసి యున్నది? మీసందర్శనభాగ్యము లభించినందులకు మాసంతసమునకు మేరలేకున్నది. దయయుంచి మీరీనాఁడిచటనుండి మేమొసఁగు సపర్యలనంది, మమ్ముఁ గృతార్థులఁజేయవలయునని ప్రార్థించుచున్నాము.

విష్ణు—కానిండు. అన్నిఁటికిని మిత్రభావము కారణము.

కుసుం—మహాప్రభూ! తగినవసతులేర్పఱుప ననుజ్ఞయిండు. నేను వెడలి, యాప్రయత్నములనుజల్పెద.

విష్ణు—మీయుత్సాహమునకు భంగమొనర్చుట సరికాదు. అంగీకరించితిని.
కుసుం—చిత్తము. (నిష్క్రమించును.)
విష్ణు—వైశ్యశ్రేష్ఠులారా! యిటనుండి వెడలినయాతఁడెవరు?
ఒకఁడు—రాజా! యతఁడు మాకెల్లరకును గురుప్రాయుఁడు. అతనిపేరు కుసుంభశ్రేష్ఠి. పత్నీసహితుఁడై యనేకపుణ్యకార్యము లొనర్చినాఁడు. సుగుణములాతనియందే నెలకొనియున్నవి.
విజ—అతని మాటలతోనే, యంతటివాఁడని తెలిసినది.
కుమా—ప్రపంచమున నొక్క గుణవంతునివలనఁగదా, వంశమునకెల్లను బ్రసిద్ధిగలుగుట?
విష్ణు—నిజముగ నాతనిముఖమందు వినయము మూర్తీభవించినది. (ప్రక్కకుఁజూచి) ఆర్యా! యీమందిరమెవరిది?
వైశ్యులందొకఁడు—ఇప్పుడు మేమువచించిన కుసుంభశ్రేష్ఠిగారిదే, యీమేడ.
విష్ణు—(పైకిఁజూచి) ఔరా! మందిరసౌందర్యము? (వాసవీకన్యనుజూచి, తనలో) ఓహో! మందిరావాసినులగు మందయానల సౌందర్యమంతకంటె వింతగొల్పుచున్నదే? అల్లదే! కన్నులకు మిఱుమిట్లుగొల్పఁగల శరీరకాంతితో స్త్రీజనమధ్యముననున్న, యాకన్యకాతిలకమెవ్వతెయైయుండునో! యడిగి తెలిసికొనెద. (ప్రకాశముగ) వైశ్యులారా! మేడపైభాగమున సువాసినులనడుమ నిల్చియున్న యాకన్యకారత్నమెవరు?
ఒకఁడు—ప్రభువర్యా! యాబిడ్డ, మాకుసుంభశ్రేష్ఠిగారి కుమార్తె. యాప్రక్కనే యామెతల్లి కుసుమాంబయు నిల్చియున్నది.
విష్ణు—(తనలో) నన్నాకన్యకాసౌందర్యమాకర్షించుచున్నది; యీవైశ్యులేమనుకొందురోకదా? యెద్దియైన యుక్తిబన్ని వీరినిటనుండి పంపెద. (ప్రకా.) వైశ్యులారా! మీరునిఁక వెడలవచ్చును. మహానందమొనఁగూర్చు మీపురమును సాకల్యముగఁ దిలకించి, పిమ్మట మీసత్కారములఁ గైకొందును.
వైశ్యులు—తమ చిత్తమురీతి నొనర్చెదము. మేమిదే వచ్చెదము. (నిష్క్రమింతురు.)
విజ—రాజా! మనమీపురమంతయుఁ జూచుటకెంతకాలమగునో కదా?
విష్ణు—ఎంతకాలమైననేమి.? యదేమికారణమో? కాని, యీపురమును సందర్శించినది మొదలు హృదయమున నానందతరంగములు పెల్లుబుకుచున్నవి.
కుమా—(తనలో) ప్రభువులు నూతనప్రియులనుట యిందులకే; యింకను వీరిభావమెట్లు పరిణమించునో?
విజ—కుమారకంఠీరవా! ప్రభువుగారి కరుణకీపట్టణము పాత్రమయినది.

కుమా—అది పురవాసుల పుణ్యమనుకొందము.

విష్ణు—(మరల, వాసవినిఁజూచి; తనలో) ఈకన్యకారత్నమును సృజించిన విధాత చాతుర్యమేమనవచ్చు?

ఉ॥ అన్నులమిన్నయౌనటు ల-యారె! సృజింప; విధాత వన్నెలుం
జిన్నెలు నొక్కచో నిలిపి,-శ్రేష్ఠతమంబగు వానిఁగొంచు, నీ
కన్నియరూపముం జలుపఁ-గాఁగని, మానససృష్టి మేలటం
చెన్ని, స్పృశింపఁబోక యటు-లే యొనరించెనొ? యేమొ? ప్రీతిమై.

లేనన్న నీమెరూపరేఖావిలాసములు గణనాతీతమగునా?

సీ॥ మోహనాకార మా - మొగముతీరునుగన్న,
జడదారి పెడదారిఁ - బడకయున్నె?
శంకరాభరణభా - స్వద్వేణిఁబొడగన్న,
ఘనులకైన, విరాళి - గలుగకున్నె?
సింహేంద్రమధ్యమ - చెలువొక్కతటిఁజూడ,
నరయు వానిమనంబు - గరఁగకున్నె?
కీరవాణిమనోజ్ఞ - గీతారవము విన్నఁ,
జట్టుసిరగుచుఁ గ - న్పట్టకున్నె?

తే॥గీ॥ తోడికన్నెలతో, గుమి - గూడి సౌధ
మధ్యముననున్న కాంత, నా - మనముదొంగి
లించి, వంచించి, మరులుగ -ల్పించె, నింక
నెటులజీవింతు? చెలియపొం - దెటులుగాంతు?

నిశ్చయముగ నేనీకాంతను జెట్టపట్టకున్న బ్రతుకఁజాల; గాని, నా యుద్దేశ్యము నెఱవేఱఁగలదా? యెందఱనో? లావణ్యవతులఁజూచితిని. నాకపుడీబుద్ధి కలుగదయ్యె. ఈవైశ్యబాలికపై, నపరిమితానురాగము జనించుచున్నది. అనుభవార్హమగుదానినిఁ గాంచిన నాహ్లాదమబ్బుట యరుదగునా? నాప్రాణమిత్రులగు నీమంత్రివరులకుఁ దెల్పి, యెటులైన నాకోర్కెని దీర్చికొందును. ఇంతకంటె గత్యంతరము తోఁచకున్నది.

విజ—దేవా! కాలముమీఱుచున్నది. వలసినచో మఱియొకపరి నీపురమును జూడ వచ్చును. సైన్యమున్నచోటి కరుగుదము. చిత్తగింపుఁడు.

విష్ణు—(కొంచెము ముందునకు నడిచి, మంత్రీ! నాయంతఃకరణమిపుడాందోళన మందుచున్నది.

విజ—మహాప్రభూ! అంతటి కారణ మేదికలదు?

కుమా—మాజీవితములున్నంతవఱకును బ్రభువుగారెట్టి చింతలును నందవలదు.

విష్ణు—(జనాంతికముగ, విజయసింహునితో) అమాత్యవరా! మీచేఁగావలసిన కార్య మొండుకలదు. మీకంటె నందులకుఁ దగినవాఁడెవ్వఁడునులేఁడు.

విజ—(జనాంతికముగ) దేవా! నాతోవచించుట కింతిసంశయింపవలెనా? యెంతటి కార్యమైనను క్షణములో నెఱవేర్చుటకు మేముసంసిద్ధులమై యుంటిమికదా? దయయుంచి తెల్పుఁడు.

విష్ణు—(మెల్లఁగా) మంత్రులారా! యల్లదే! మేడపైఁ గనిపించుచున్న కుసుంభశ్రేష్ఠి కొమరితపై, నామనము దగిలియున్నది; యెట్లైన నాకన్యారత్నమును గ్రహించితీరవలయు.

కుమా—(తనలో) నేనపుడే, యీతని దృష్టి నెఱిఁగి సంశయించితిని. అదిసార్థకమైనది, (ప్రకా) రాజా! యదియొక గొప్పకార్యము కాదు. సమస్తవైభవోపేతులగు రాజుల నే జయించిన మీవిషయమై, యావైశ్యులు భయమందకమానరు. బదులు వచింపఁజాలరు.

విజ—వారొకవేళ బదులువచించిన మాత్రమున, మీకోర్కి నెఱవేఱకపోదు. ఈ విజయసింహునిసాహస మీకార్యమునందుఁ గనుఁగొనుఁడు.

విష్ణు—మంచిది. మనమిట నాలస్యముగనుండుట సరికాదు. సంశయమునకాస్పద మగును. సైన్యసమూహముండిన ప్రదేశమున కరుగుదము రండు.

విజ—చిత్తము. తర్వాత మిగిలిన విషయములకై పర్యాలోచనసేసి, వైశ్యుతో మాటాడవచ్చును.

కుమా—నాకును నదియే, మంచిదని తోఁచుచున్నది.

విష్ణు—(మరలఁబైకిఁజూచి, తనలో) ఔరా! యీకాంతాలోకనశృంఖలములు పదములను గదలింపనీయకున్నవి. మన్మథుని ప్రభావమమోఘమైనది. మహారాజగు నన్నీకన్యకను దాసుఁడుగా నొనర్పఁ బ్రారంభించెను. (ప్రకా) అమాత్యులారా! నేఁడీపురాంగనాతిలక మొంతరమణీయమును గొల్పుచున్నది. కనుఁగొనుఁడు.

సీ|| కల్పితారుణకాంతి - కంజంబుఁ దిలకింప
ముఖసామ్యమై కడు - మురువుగొలుపు ;
సాధవిరాజిత - జాతరూపచ్ఛటల్
తనుకాంతికుద్దియై - తళ్కులీను ,
నందమై వెలుఁగొందు - నట్టి దర్పణములు
గండభాగమ్ముల - ట్లుండు ; మఱియుఁ
గనుల పండువుసేయు - ఘనమణిలికుచముల్
కుచయుగోపమమయి - కూర్మిఁగూర్చు ;

తే||గీ|| సౌందర్యమై కానఁబడుచున్న - యింద్రనీల
మణులు నీలాలకలరీతి - గనఁ గెక్కు
వజ్రయుత రత్నమాలికా - పంక్తులరయ
సోగ కనుచూపుల విధంబు - సొంపునింపు ; ||

విజ—దేవా! పురాంగన, నిక్కముఁ బరమాహ్లాదప్రదయయ్యే, యున్నది. మిమ్ము వంటి ప్రభువరులను గనుభాగ్యమందినది.

విష్ణు—మంత్రీ! నీమాటలు సముచితములై, వ్యంగ్యార్థములు గనున్నవి. నీచాతుర్యము నను సంతసించెద.

కుమా—మహీరమణా! గమ్యస్థానమును జేరుట, ప్రథమకృత్యము.

విజ—ప్రభువర్యా! మఱచితిమి. మనమిఁక నిటనుండి వెడలుదము. మీయభీష్టమును నెఱవేర్చుట మావిధియై యున్నదికదా ?

విష్ణు—తగిన మంత్రివరులచేఁ గార్యసాధనము కడుసులభము. దైవమును, మనకుఁ దోడ్పడుఁగాక! రండు. పోవుదము.

(అందఱు నిష్క్రమింతురు. తెరవాలును.)

# వాసవీ విలాసము.

## సప్తమాంకము.



[ పెనుగొండ నగరేశ్వర దేవాలయము. ]

ప్రవేశము ; మల్లుఁడు.

మల్లు.—వైశ్యులపాలిటి మిత్రివలె వీరాజెందుల కిచ్చటి కేతెంచెనో ? క్షత్రియవంశుఁ డగు తానెక్కడ ? వైశ్యకన్యక యెక్కడ ? యాబిడ్డ నితనికిచ్చి వారు కుల భ్రష్టులు కావలెనా ? యతని మంత్రులైనఁ దగినబుద్ధినిఁ జెప్పక మధ్యవర్తులై, వైశ్యులనే నిర్బంధించుచున్నారు. కన్యనిచ్చినఁ గులముచెడునను సంశయమును, లేనియెడల రాజేమిచేయునో ? యనుభయమును, బాధింపఁ బాపము! వారేమి తహతహపడుచున్నారు ? భాస్కరాచార్యులవారిని, వైశ్యులనందఱను, నగరే శ్వరదేవాలయమునకుఁ బిలుచుకొని రమ్మని కుసుంభశ్రేష్ఠి యనుజ్ఞచేసె; నేనా తని మాటమేరకు నెల్లరను బిల్చివచ్చితిని. వారింకను రారైరి. తుదకీ యనిష్ట వివాహప్రయత్నమెట్లుపరిణమించునో ? నాకునుభయమగుచున్నది. (ప్రక్కకుఁజూచి) అదిగో ! కొందఱు వైశ్యులును, కుసుంభశ్రేష్ఠియు, భాస్కరా చార్యులును వచ్చుచున్నారు. చింతాక్రాంతులయి యేతెంచు వారిమొగము లెంతి వెలవెలఁబాఱుచున్నవి ?

తే॥గీ॥ ముందు గోయియు, వెనుకకుఁ - బోవ నూయి,
యనెడు సామెత మాయెడ - నర్థయుక్త
మయ్యె ; నేశూద్రుఁడయ్యు జ - న్మాంతరమున
నేమి సంబంధమో ? వారి - నే తలంతు. ॥

కానిమ్ము. దైవవిధి ననుసరింపక తప్పదు. నేనావైశ్యులకుఁ దగినంత సాహాయ్యమొనర్చెద. (ఆలయముచెంతఁ గూర్చుండును.)

[భాస్కరాచార్యులును, కుసుంభశ్రేష్ఠియు, మల్లశెట్టిఁడును, గురుశెట్టిఁడును, నేతెంచి యుచితస్థలములఁ గూర్చుందురు.]

భాస్క—కుసుంభశ్రేష్ఠీ ! విష్ణువర్ధన మహారాజునకు నీకూఁతునొసఁగు విషయమునఁ గల యభీష్టమేమి ?

కుసుం—గురువర్యా ! మావారలందఱకేది యిష్టమో ? నాకును నదియే యిష్టము.

మల్లశెట్టి—గురువర్యా ! మంచిచెడ్డల నన్నిఁటినిఁ దెలుపు బాధ్యతే మీయదియేకదా ? మీరెట్లు వచించినను, మాకిష్టమే.

భాస్క—(తనలో) ఈవైశ్యు లేవిషయముఁగాని బయలుపడునట్లు చెప్పరు. ఎవఁడైన నొకఁడు సాహసించి ముందంజవేసిన యెడల నందఱును వెన్నంటువారే. (ప్రకా) వైశ్యులారా ! కులధర్మమును గాపాడఁ దలఁచుకొన్నచో, క్షత్రియునకుఁ గన్యనిచ్చుట సరికాదనియే నాయభిప్రాయము.

గురుశెట్టి—స్వామీ! మేమెన్నఁడును మీయాజ్ఞ ధిక్కరింపముకదా ? మాకును నదియే సమ్మతి.

మల్లుఁడు—మీరందఱును రాజునకుఁ గన్యనీయఁగూడదని నిర్ణయించుకొనుట గొప్ప కాదు. ముందురాఁబోవు నిడుమలకు నుపాయమును, మీరే యోజించికొనుఁడు.

కుసుం—మల్లుఁడు వచించినమాటయు నిజమే; యీరాజన్యుఁడూరక విడుచునా ? లేకలేక నాకీపుత్రిక గల్గుటయు, దుర్భరమగు నీకష్టము ప్రాప్తించుటయు, సమకూడినవి. దైవమునకు నేనేమియపకార మొనర్చితిని ? రేయుంబవలుతనినే, నమ్మికొని ధ్యానించుచుందునే; కట్టా! యెంతటి పాపపుఁబుట్టువు నందితిని ?

సీ|| ఏనాఁడుఁ దనరాక - యే విని యెఱుఁగమే,
విష్ణువర్ధనుఁడిందు - విడియనేల ?
విడిసెఁ బో! పురిరమా - విభవంబుఁ గనుఁగొనఁ,
దాను మంత్రులతోడఁ - దరలనేల ?
తరలెఁ బో ! యెందఱో, - తరుణులుండఁగ నాదు
పట్టిపైఁ దనదృష్టి - పడఁగనేల ?
పడియెఁ బో ! వలదని - ప్రాజ్ఞులెల్లరుఁ జెప్ప
వినక మొండితనంబు - గొనఁగనేల ?

తే||గీ|| లేక లేక జనించిన - నాకుమారి,
క్షత్రియాగ్నికి హుతముగాఁ - జలుపుదెటుల ?

బాపురే! మీఁబరాని యీ - పద ఘటించి,
దైవమా! మమ్ము బాధింపఁ - దలఁచితేల? ||

(తలవంచుకొనును.)

గురుశిష్యు—మహారాజసందర్శనమైనఁగూడెనని సంతసింప, వెంటనే మితిలేని చింత సంప్రాప్తించినది. అతనికీ దుర్బుద్ధి యెందునకు జనించినదో?

మల్లశిష్యు—అతనికి దుర్బుద్ధి జనించినను, సుబుద్ధి జనించినను, నిరుకేలంపులఁ బిశాచపుఁ బట్టుపట్టెడు సచివులుండలేదా? వారీమధ్యవర్తిత్వమున కంగీకరించుట వింతగానున్నది.

గురుశిష్యు—వింతయేమి? దినమునకుఁ బదిసారులైనను విసువక తిరిగి తిరిగి కుసుంభశ్రేష్ఠి పీచమణఁచుచున్నారు.

మల్లుఁడు—(ముందునకుఁజూచి) మీమాటలు కొంచెమాపుఁడు. విష్ణువర్ధనుని మంత్రి విజయసింహుఁడిటకే వచ్చుచున్నాఁడు.

కుసుం—వచ్చెడువాఁడు నాపాలిటి ప్రత్యక్షశనైశ్చరుఁడు.

ప్ర; విజయసింహుఁడు.

విజ—సహృదయులగు మీకెల్లరకు వందనములు.

(నమస్కరించి యొకచోఁగూర్చుండును.)

గురుశిష్యు—మహారాజమంత్రులగు మీరు మాకు వందనము లర్పించుట వింతగానున్నది.

విజ—ఏమియువింతలేదు. దేవతాసాన్నిధ్యము. శ్రీభాస్కరాచార్యస్వామివారును నిటనుండిరి. మీయందును నాకట్టి గౌరవముకలదు.

మల్లశిష్యు—(జనాంతికముగఁ, గుసుంభునితో) విపరీతమైనగౌరవము; అన్నియు దొంగ నడతలు.

విజ—(భాస్కరాచార్యులతో) స్వామీ! మారాజునకు నీకుసుంభశ్రేష్ఠి కుమార్తెనిచ్చి వివాహము సేయఁగూడదా? నేనెంతచెప్పినను, వీరి మనస్సున కెక్కకున్నది. కులధర్మము కులధర్మమని చాటింతురంతియేగాని, వారి కలవడఁబోవు మహాభాగ్యము నెఱుఁగకున్నారు. మీరైన బోధింపుఁడు.

భాస్క—వారికిష్టమయినయెడల నెవరిబోధనలు నక్కఱలేదు.

తే||గీ|| అరయఁగా, నాస్తిబుద్ధి సౌ - ఖ్యప్రదంబు,
పరుల శేముషి విపరీత - కరమటంచు,

సర్వజనులకు వేద్యమే ; - జగతిలోన,
మీకువచియింప, నాకంత - మేధకలదె ? ||

విజ—ఇంకనుఁ గొన్నిఁటిని గుప్తపఱచితిరెందుకు? వీరికి మీరు గురువులుకదా ? మీ రేమి వచించినను, వారికి శ్రేయస్కరమే.

కుసుం—మంత్రివర్యా ! యీధర్మమెందైనఁగలదా ? ముందెవఁడైన మావైశ్యుఁడు క్షత్రియునకుఁ గన్యనిచ్చియుండెనా ? ఒకరికి నీతులుచెప్పఁదగిన మీరు, మూర్ఖతను వహించుట సరికాదు. క్షమించి మాకులధర్మమును దెలుపుఁడు.

విజ—కుసుంభశ్రేష్ఠీ ! మూర్ఖతను వహించినది నీవుమాత్రము సుమా ! మీవైశ్యజాతి కన్యను ధృతరాష్ట్రభూపాలుఁడు వివాహమాడియుండలేదా ! మహారాజబాంధవ్యము తలక్రిందుగాఁ దపస్సొనర్చినను, లభించునది కాదు. ఇదిగాక, మీకులమునకంటె నెక్కువ కులమేకాని, క్షత్రియవంశము తక్కువది కాదు.

మల్లిశెట్టి—ఎవరికులము వారికెక్కువలెండు. జరుగఁదగిన కార్యముమాత్రమే, యెక్కువ కానిది.

మల్లుఁడు—మంత్రిగారి కన్నియోజనలును గలవు. హృదయములు పరీక్షసేయుట కిట్లు మాటలాడుచున్నారంతియే.

విజ—(తనలో) వీఁడెవఁడురా ? చమత్కారమంతయుఁజూపించుచున్నాఁడు. (ప్రకా) నామాటలన్నియును యథార్థములు. గౌరవము యీవిధానాంతమువినట్లు, రాజుగారే, కోరినందువలన మీకింతబింకము.

కుసుం—బింకములన్నియు వంకలోఁగలిసినవి. దిక్కుతోఁచుటమాత్రము లేదు. ఈ విషయమై మావైశ్యులనెల్లరను నడుగవలయును.

విజ—బంధువుల నడుగుటయు ధర్మమే. దానికెవఁడు వలదనును ?

మల్లుఁడు—వైశ్యులింకను నెవరో ? వచ్చుచున్నట్లున్నది.

ప్ర ; మాలిశెట్టుఁడు, సోమశెట్టుఁడు.

కుసుం—రండు. ఇటుఁగూర్చుండుఁడు.

(మాలిశెట్టుఁడును, సోమశెట్టుఁడును గూర్చుండుదురు)

విజ—ఏమయ్యా ! మా రాజున కీతనికూఁతునొసఁగుట మీకు సమ్మతమేనా ?

మాలి—ఎవరినడుగుచున్నారు ? ఊరును బేరును లేనివాఁడెవఁడో ? మీకుఁబ్రత్యుత్తర మిచ్చువనుకొంటిరా ?

సోమ — మంత్రిగారితోఁ గొంచెము తెలివికలిగిమాటలాడుము.

మాళి — తెలివిలేనిచో నేనిచ్చటికి వచ్చియే యుండను.

విజ — వైశ్యులారా! యెవఁడితఁడు? అధికప్రసంగము సేయుచున్నాఁడే?

మాళి — అన్నియధికప్రసంగములును మీయొద్ద నేయున్నవి. లేకుండిన, రాజునకు మా కన్యనడుగుదురా! లేక లేక యెన్నియో వ్రతములు దానములొనర్చి, తుదకీ పుత్రి కనుబడసిన మా కుసుంభశ్రేష్ఠిని గోడుగుడిపింతురా?

విజ — నీ శ్రీరంగనీతులిఁక మానుము (పైకిలేచి, తనలో) ఔరా! వీరిచాతుర్య మద్భుతముగనున్నదే? మహీపాలుఁడీ వైశ్యకాంతకొఱకై బెంగపడియుండె, నిఁకేమి సేయవలయు? ముందుగ క్షణములో నీకార్యము నెరవేర్చెదమని విఱ్ఱవీగితిమిగాని, వీరిని సరియైన త్రోవకుఁ ద్రిప్పుటకుఁ దలప్రాణము తోఁకకు వచ్చినట్లయినది (ప్రకా) సకలదిగ్వలయమును జయించిన భూపాలునాజ్ఞ నుల్లంఘించి మీరు బ్రతికెదరు బ్రతుకు నే నెఱుఁగనా? మీరే యోజించి తీర్మానించుకొనుఁడు. (నిష్క్రమించును.)

కుసుం — ఔరా! నాతలవ్రాఁత బాగుగనున్నది. ఇప్పటినుండి మీరు దండోపాయమును వహించుటకారంభించిరి. (దుఃఖముతో)

సీ॥ ప్రభునాజ్ఞ ధిక్కార - భావంబుననుగాంచ
నతఁడేమి సేయునో? - యనెడుభీతి;
సుతనిచ్చి యాపైని - జూచెదమనఁ గొన్న
నమల వంశముకూలు - ననెడుభీతి;
పత్నికి వినపింపఁ - బరిభవంబనియెంచి
తనజీవితముఁబాయు - ననెడుభీతి;
వంచన చేనైనఁ - బొంచి యామంత్రులు
నాత్మజఁ గొనుదురో? - యనెడుభీతి;

తే॥గీ॥ తుదకు భీత్యావహంబయి - హృదయమిట్లు
క్రుంగి కృశియింపఁ దొడఁగు; నే - క్రూర కర్మ
బద్ధుఁడై యుంటినో? లేక - బుద్ధిలేదొ?
దైవమే, నంబరీక్షింపఁ - దలఁచినాఁడొ?

సోమ — కుసుంభశ్రేష్ఠీ! నీవీవిధమున దుఃఖించుట మంచిదికాదు. ఏమైననుసరియే! మనమా రాజునకుఁ గన్యనిచ్చుట, ధర్మముకాదు. మఱియు, యుక్తిచాతుర్యములుగల, మన బాలనాగరుల, నారాజుకడకంపియుంటిమికదా? వారేమి తెలిసి

కానివత్తురో ? యనియునము. నీబాంధవులగు మేమందఱును, కష్టముగాని సుఖముగాని. నీతోసమానముగ ననుభవింప నిశ్చయించుకొంటిమి.

భాస్క—సోమశిష్టుఁడు వచించినట్లు మీరెల్లరేకగ్రీవముగఁ గులధర్మమును శాసించుట, యుత్తమవిధానము.

ప్రవేశము బాలనాగరులు. ధనదుఁడు.

భాస్క—బాలనాగరులారా ! మీరు వెడలివచ్చిన కార్యమేవిధముగఁ బరిణమించినది? విష్ణువర్ధనభూపాలునభిప్రాయమును దెలిసితిరా ?

ఒకఁడు—ఆరాజు మేమెన్నియుక్తులనుబన్నినను, మనవాసవి నిచ్చితీఱవలయునను మాట, మాటిమాటికి మాటలాడును.

వేఱొకఁడు—ఏమిమాటలాడినను, తుదకు మాచాతుర్యమునఁజూపి ప్రకృతముమాత్రి మీయూరు విడిచిపోవునట్లు చేసితిమి.

కుసుం—వయసునఁ బిన్నవారైనను, సాహసకార్యమొనర్చితిరి. అదెట్లు ?

మఱియొకఁడు—మేమారాజుతో, మహాప్రభూ ! మా పెద్దవారందఱును వాసవికన్యను మీకొసఁగునిష్టములేక మిమ్ములను విందుభోజనమునను రమ్మని మోసగించుచున్నారు. మాయిండ్లలోజరుగు పెండ్లిపెత్తనముల విషయమై, కన్యనడుగువారుగాని, కన్యనిచ్చువారుగాని, లగ్నమగుపర్యంతము నొకరియింట నొకరు భుజింపరు. ఆవివాహము మనస్సునకయిష్టమైననే, విందులకు బలవంతపెట్టుట; యని చెప్పితిమి.

భాస్క—రాజుముందుగ విందునకేరాకుండఁ, దగినయుక్తిఁ జూపినారు.

కుసుం—తర్వాత నేమిజరిగెను ?

ధన—మామాటలతఁడునమ్మి, మాహృదయములలో భేదభావములేదని విశ్వసించి, మీ వాసవికన్య నాకేవిధమున లభించునో ? వచింపుఁడు. మీకుఁగావలసిన మణిభూషణాదుల నిచ్చెదను. తుదకు నారాజ్యమున నర్ధభాగమైన నొసఁగెదను. అనియుబ్బి తబ్బిబ్బయ్యెను.

గురుశిష్టు—ధనదా ! దానికి మీరేమి బదులువచించితిరి ? మీపిల్లతనముతో, రాజ్యమనిన నాసఁజెందితిరా ?

నాళిశిషు—వారికట్టి మాయవచనములు తెలియవా ? మన పెద్దవారికంటె వారే, యీకార్యమునఁ జాలవఱకు సాహాయ్యమొనర్చుచున్నారు

మల్లుఁడు—నడుము, నడుము, మీమాటలతో నావిషయము సరిగాఁ జెప్పనీయరు. (ధనదునితో) అయ్యా ! యక్కడజరిగిన ప్రసంగము మీరు చక్కఁగాఁ జెప్పుఁడు.

ధన—రాజుగారి మాటలువిని మేమును, ప్రభువా ! రాజ్యము కొఱకు మేమాసింపము. మీవంటి గొప్పవారి బాంధవ్యము కల్గినఁజాలదా ? మీరుమాత్రి మీసమయమున

మావారొనర్చు విందులకు రావలదు. మీపట్టణమును జేరికొని సుఖముగఁ గాలము గడుపుచుండుఁడు. అని చెప్పితిమి.

భాస్క—దానికతఁడు సమ్మతించెనా? దుర్మార్గులగు మంత్రులు మీమాటలు విననిచ్చిరా?

ఒకఁడు—మేము మాటలాడు సమయమున మంత్రులట లేరు.

భాస్క—అదియొక శుభసూచన.

వేఱొకఁడు—మామాటలన్నియును నతఁడు వినెనుగాని,

కుసుం—అంతలో బుద్ధి పెడతలఁబట్టెనా?

వేఱొకఁడు—మనవాసవీకన్యక నాతనికి నొసఁగితీరవలయునని మాత్రము నిర్బంధించెను.

కుసుం—ఎన్నియుక్తులొనర్చినను నతనిపట్టు వదలఁడయ్యెనా? యొకవేళ, మనమతనికి బిడ్డనొసఁగుటలేదని నిరాకరించిన నేమి సేయును?

వేఱొకఁడు—అదియే నేను జెప్పఁబోవునది. పిమ్మట మమ్మందఱను నతఁడు దగ్గఱకుఁ బిలిచి, మీరు విశ్వాసపాత్రులు. గనుక, మీమాటలనునమ్మి, నారాజధానికి వెడలెదను, సాధ్యమైనంతత్వరలో మీపెద్దవారికిని బుద్ధులు కుదిర్చి వాసవీకన్యను నాకొసఁగునట్లొనర్పుఁడు. అటుగాక మోసగించితిరా? మీపట్టణములఁ గొల్లగొట్టి, మిమ్ము నిర్మూలించి యాకాంతను గైకొందును. ఇది ముమ్మాటికిని నిక్కము. అని వచించెను.

కుసుం—ఏమి ప్రారబ్ధమనుభవింపవలసివచ్చెను? దైవమునకును దయలేదయ్యెఁగదా?

భాస్క—కుసుంభశ్రేష్ఠీ!

చ॥ వగచిన నేమిలాభము? నృ-పాలుఁడు వాసవికన్యకామణిన్
మిగుల వరించినాఁడు; కుల-మే చెడునో? యిడుముల్ ఘటించునో?
జగతిధవుండు బంధుఁడయి-సౌఖ్యమె కూర్చునో? లేక యాతనిన్
దగని కృతంబుఁ గోరెనని-దైవమె కూల్చునో? యెద్దికల్గునో?

భగవన్నియామకమును దప్పించుకొన, నీకును, నాకును, మహారాజునకును దేవతలకును, సాధ్యముకాదు.

ధన—కట్టకడకాభూపాలుఁడు మమ్ములనుగాంచి, మీరు వంచనలేక నాకాకన్యక నొసఁగుట నిజమేనిఁ దగిన ప్రతిజ్ఞ సేయుఁడు. లేనియెడల నేను విశ్వసించుటకు వీలులేదు. ఈనాఁడే, మీకిష్టమైనను నవిష్టమైనను, మీవైశ్యసంఘమును మడియించి, కన్యకారత్నము నపహరించుకొని, పిమ్మట నారాజధానికరగెదనని గంభీరముగఁ బలికెను.

గురుశిష్టు—ఇంక మనయూహలు పనికిరావు. కులాభిమానమునఁ బ్రాణత్యాగమైనఁ జేయవలయును. అంగీకారమున భూపతికిఁ గన్యకాతిలకము నైన నీయవలయును. బాలనాగరులు ప్రాజ్ఞులు కావుననే, యీవిషయమైనను బయటఁబడఁజేసినారు.

ధన—ప్రకృత మతనివలన బాధతప్పిపోయినఁ జాలునని యోజించి, యెప్పటికైన నిది మనకుఁ దప్పదని నేను మాత్రము సుదృఢముగఁ బ్రతిజ్ఞఁజేసితిని. ఈయభీష్ట మేరీతి నుండునో ?

మల్లశిష్టు—ఎవరియభీష్ట మేదియైనను, గురుశిష్టుఁడు చెప్పినదానికంటె నిత్యాంతరము లేదు. కాని, నీవేమని ప్రతిజ్ఞ సేసితివి ?

ధన—రాజా ! మీరీనాఁడే రాజధానికి వెళ్లుఁడు. మే మావాసవికన్యను మీకొసఁగక మోసగించినయెడల, నగ్నిలో దుముకుటకైనను నొప్పుకొందుము. తర్వాత మీ రేమైనఁ జేసికొనుఁడు. నాప్రతిజ్ఞకు సూర్యచంద్రాదులు సాక్షి ; యని వచించి వారినిఁ బ్రయాణము సేసి, సాగించివచ్చితిని.

సోమశిష్టు—మంచిప్రతిజ్ఞ నొనర్చినాఁడవు. అక్షత్రియునకు మనబిడ్డ నొసఁగుటకంటె, నగ్నిలోఁబడిచచ్చి కీర్తియైన నిలుపుకొనుట కులగౌరవము. ఆమహాభూతములు మనపట్టణమును దొలఁగిపోయినది చాలును.

భాస్క—కుసుంభశ్రేష్ఠీ ! ధనదుని ప్రతిజ్ఞయు, మీవారి యభిప్రాయములును, దెలిసినవి కదా ? రాజునకుఁ గూఁతునిత్తురా ? ప్రాయోపవేశమున కొప్పికొందురా ? యోజింపుఁడు

మల్లుఁడు—దేవునకిట్టి విచిత్రములపై నెంతయిష్టమున్నదో ? పాప మాయెలప్రాయఁపుబాలతో నీదంపతులు కులమును విడువవలయునా ? యగ్నికుండముఁ బడవలయునా ?

ధన—కులగౌరవము నిలుపుట యతనికి మాత్రము ప్రధానము కాదు. వైశ్యులెల్లరును దేనికైన నంగీకరింపవలసినదే; అందునకు నేను మొదటివాఁడను.

మాళిశిష్టు—వారుమాత్ర మగ్నిప్రవేశము చేసిన, మిగిలిన వైశ్యులీద్రోహమొనర్చిరని, రాజు సంహరింపకుండునా ? కావున, ధనదుని యభిప్రాయమే, నాయది

కుసుం—గురువర్యులగు భాస్కరాచార్యులుగారు వైశ్యులకందఱకును బత్రికల వ్రాసి పంపి, కులాభిమానముతోఁ బ్రాణములు విడుచుటకైన సిద్ధపడువా రెందఱు గలరో ? తెలిసికొనవలెనని ప్రార్థన.

మల్లుఁడు—మీ కాసందియ మెందునకు ? మీపైనభిమానముగల మీబంధువులంగీకరింతురు. మొదటినుండియు, భేదముగ నేయున్న మిగిలినవారిష్టపడరు. నే నేకదా ? పత్రికలు తీసికొనిపోవువాఁడను. నే నెంత చెప్పితినో ? యంతయే జరిగితీరును.

భాస్క—కానిమ్ము ! తెలిసికొనఁదగిన విషయము తెలిసికొనవలసినదే; మల్లా! నీవు మాయింటికిరమ్ము పత్రికలు వ్రాసియిచ్చెదను.

మల్లుఁడు—చిత్తము. (ముందునకుఁజూచి) ప్రొద్దగుచున్నది. మనమిఁక నిండ్లకుఁబోవుదమా ?

భాస్క—(లేచి) కుసుంభశ్రేష్ఠీ ! జరిగిన విషయమును నీభార్యకును, బిడ్డలకును జెప్పి, వారియిష్టముఁ గనుఁగొనుము. వెడలుదమురండు.

[ అందఱును నిష్క్రమింతురు. తెరవాలును. ]

# వాసవీ విలాసము.

## అష్టమాంకము.



( కుసుంభశ్రేష్ఠి మందిరము. )

[ కుసుంభశ్రేష్ఠి యొకపీఠముపై నొరగిలి పరుండియుండును. కుసుమాంబ ప్రక్కను నిలిచియుండును. ]

కుసుమా—నాథా! నిరంతరము మందహాసముతోఁ గూడియుండు మీవదన మీనాఁ డేమునకు ఖిన్నతవహించినది? తెలియక నేనేమైన నేరమొనర్చితినా? లేక, యేధర్మకార్యమునకైన భంగముకలిగెనా? మీయాజ్ఞను శిరసావహించు చిన్ని కుమారుఁడీ మెడఁ దమ మాటకుఁగాదని బదులువచించెనా? యేదుర్మార్గుఁడైన లేనిపోని యపవాదములనిడి చింతిల్లఁజేసెనా? దయయుంచి యీదీనురాలికి వినుపింపుఁడు.

కుసుంభ—(గద్గదకంఠుఁడై) ప్రేయసీ! నీవొనర్చిన నేరమేదియులేదు. కుమారుఁడు నామాటను మీఱెదియులేదు. నాప్రారబ్ధము నన్నీవిధమునఁ దపింపఁజేయుచున్నది.

కుసుమా—కారణమేమి? కరుణించి వచింపఁగూడదా?

కుసుంభ—వచింపతీరదుగాని, నోరాడకున్నది.

కుసుమా—నాథా! యంతటి దుఃఖవిషయ మేదియోకదా? యేమిముప్పు వాటిల్లినది?

కుసుంభ—విష్ణువర్ధనుఁడను రాజొకఁడు మనయూరికి వచ్చియుండెనుగదా? యతనికిఁ దగిన సత్కారములనొనర్చితిమి.

కుసుమా—అతనికొసఁగిన సత్కారములలో, లోపములెంచి యాతఁడు కోపమందెనా?

కుసుంభ—అతనికిఁ గోపమేమియులేదు. మఱింతసంతోషమే; మనకుమాత్రమే ప్రాణకంటకము. ఆదుర్మార్గుఁడు, మనవాసవీసౌందర్యమునకు వశుఁడై యామెను దనకిచ్చి వివాహమొనర్పవలెనని పట్టుపట్టినాఁడు.

కుసుమా—మహారాజగునతనికి జ్ఞానశూన్యమా? యుక్తాయుక్త విచక్షణలేక, మూఢునివలె నతఁడీమాటనెట్లు మాటలాడెను?

కుసుం—ఇట్టి యాలోచనలతో నించుకైన లాభము లేదు. (లేచికూర్చుండి)

సీ॥ వైశ్యకన్యను రాజ - వర్యులు కోరుట
సరికాదనుచు వాదు - సల్పినాఁడఁ;
గులధర్మమీరీతిఁ - గూల్పఁదలంచుట
శ్రేయమ్ముగాదని - చెప్పినాఁడఁ;
వలసిన భూషణాం - బరవస్తు సంతతిఁ
జేకూర్తుమనుచు వ - చించినాఁడఁ;
బదియు నెన్మిదియైన - పట్టణరాజముల్
పాలించుకొనుఁడని - పలికినాఁడఁ;
తే॥గీ॥ దుదకు, సుతనీయలేదని - దుడుకుఁ దనముఁ
జూపినాఁడనుగాని, యా - పాపికెవియు
రుచ్యములుగావు; మనలను - రూపుమాపి
యైన, వాసవినిం గొనఁ - బూనినాఁడు.

(తలవంచుకొనును.)

కుసుమా—(దుఃఖముతో) కట్టా! యిఁకేమిగతి?. దైవమా! మాసౌఖ్యమును నంతము నొందింపఁదలఁచితివా? నీకేవిధముగు ద్రోహమును జల్పియుండలేదే? హా! బిడ్డా! లేక లేకకలిగిన నీకీదుప్ప్రాప్తి వెన్నంటెనే? కులమునకు వన్నెఁదెచ్చు గుణవతియని పొగడుకొనుచుంటిమే! తుదకు నీగుణగణము లాక్రందుర్మార్గునికడ లీనమై పోవలసివచ్చెనా? ఛీ! ఛీ! ఈఘోరకృత్యము నొనర్చుటెట్లు? లేక, యా రాజుబారికిఁబడక బ్రతుకుటెట్లు? నాథా!

సీ॥ సంతానమేలేని - చింతతోఁ గుములుచుఁ
గ్రుంగి కృశించుట - కొన్నినాళ్లు;
తపములు వ్రతములు - దానముల్ పొనరించి
కోర్కెకై యరయుట - కొన్నినాళ్లు;
సుతుఁడు మాత్రముకల్గి - సుతలేకపోవునో?
కూడునో? యనియుంట - కొన్నినాళ్లు;
సంతానమదికల్గ - సద్గుణయుక్తమై
కుదురంగఁ గాంచుట - కొన్నినాళ్లు;

తే॥గీ॥ పెంచి, పెద్దలఁజేసి, సు - ఖంచి, మించి,
కోలఁదిగా, సంతసించుట - కొన్నినాళ్లు;
కడచె, నంతియెగాని, యీ - బుడుతలకును
మనకు నంతకుఁడయ్యెనా? - బ్రాహ్మనరుండు: ||

దుర్భరమగు నీవార్త, శరీరమును గంపింపఁజేయుచున్నది. నేనెంతటి కఠినాత్మురాలను? అబ్బా! గత్యంతరము తోఁచుటలేదు. దైవమా! నీవే శరణము. (క్రిందబడును.)

కుసుం—కాంతా! మన కీసంతానము దురంతసంతాపమునకు హేతువైనది. ఎంత వగచినను, పరిణామము ప్రాణత్యాగమే; పౌరనాగరులు సయితమా రాజునొద్దఁ దమయుక్తుల నెన్నియో? పచరించిరగాని, యవియు నిష్ఫలములే. తుదకతఁడా క్షణముననే నిర్బంధించియైన వాసవినిఁ గొనిపోవుదునని శాసింప, మనవారును నేనును భయపడితిమి. దానికిని పౌరనాగరులేయోజించి, యెన్నటికైన మన బిడ్డ నితనికీయకతప్పదు. ఈతరుణముమాత్రమెట్లో? తప్పించుకొనినఁ జాలునని, రాజా! క్రమముగ మావాసవికన్యను మీకిచ్చెదము. అటుగాక, మోసము చేసితిమేని మేమందఱము నగ్నిపాలగుదుము. అని నమ్మికఁగూర్చి మనపురినుండి యీరాజును సాగనంపిరి.

కుసుమా—(లేచికూర్చుండి) అయ్యో! తలంచుకొనుకొలఁది బాధలధికమగుచున్నవే? నాముద్దులపట్టిని, నానోములపంటను, నావరాలమూటను, నాభాగ్యదేవతను, గులమునకు దూరమొనర్చి, క్షత్రియునకొసంగుటకు సాహసింపవలెనా? లేనిచో, నగ్నిపాలొనర్చి లోపలను వెలుపలను మంటలెగయ, మేమును నాబిడ్డతోఁ జావవలయునా? (కొంచెము యోజించి)

తే॥గీ॥ అన్యవంశజునకు నాత్మ - కన్యనొసఁగి
ఘనతరంబగు దుష్కీర్తి - గనుటకంటె,
నీటనో? యగ్నినో? యురి - త్రాటితోనొ?
ప్రాణములు పాయుటయె, మంచి - పథము తలఁప;

ఈమాటలను ముమ్మాటికిని నాబిడ్డలయెడుట వచింపఁజాల! క్రూరకర్ములగుమాగర్భమున జనించి వారలెంతటి కష్టదశఁ బొల్పవలసివచ్చె? నాథా!

యిది వానలేని పిడుగు. మీకిష్టవచ్చినట్లు సేయుఁడు. నాకీ ప్రాణములపై నిఁక నాసవలదు.

కుసుం—ప్రాణపరిత్యాగమునకు, ముందుగ నేనును సిద్ధపడియున్నాను. బిడ్డలకీసంగతిని వచింపఁజాలకున్నాను.

ప్రవేశము విరూపాక్షుఁడు.

విరూ—తలిదండ్రులారా! మీవిచారమునంతయు వింటిని. మీరు మాతోఁనుడువుటకు సంశయింపఁబనిలేదు. మీయుద్దేశ్యము నతిక్రమించునంతటి పాపమున కొడిగట్టియుంటిమా? మనకుఁగల భాగ్యమునకంటెను, వైభవమునకంటెను, గులమేకదా గొప్పది? కులహీనునకెంత భాగ్యముండినను, గౌరవమునకుఁ బాత్రుఁడుగాఁడని పెద్దలు వచించుటలేదా? యాదురాత్మునకు వాసవినిచ్చుట నాకునునిష్టములేదు.

కుసుం—కుమారా! విరూపాక్షా! మాయభిప్రాయమును, మాటలును, నప్పుడే రహస్యముగ గమనించితివి. మగబిడ్డవు కావున నీకింతటి స్థైర్యమున్నది. కాని, మన వాసవిగతియేమి?

విరూ—తండ్రీ! వయస్సునఁ జిన్నదైనను, గుణములయందు గొప్పయని ప్రఖ్యాతికెక్కిన మన వాసవి దుర్నీతి కెన్నఁటికిని మనసొగ్గదు. ఈవార్తలప్పుడే పురమంతయు నిండినవి. ఆమెకుఁగూడఁ దెలిసియే యున్నవి. తెలిసియుఁ దెలియని దానిరీతి నున్నదికాని, యామె కులగౌరవముఁ జెడుపదు.

కుసుమా—తనయా! నీకెంతటి జ్ఞానముకుదిరినది? (చేఁదీసి ముద్దిడి) నీముద్దుచెల్లెలిని మహానందముగఁ దగిన వరునకిచ్చి వివాహమొనర్చి కన్నులారఁగాంచి సంతసించు ప్రాప్తము మనకులేకపోయె. (కన్నుల, నీరునించును.)

విరూ—అమ్మా! దైవమునకుఁ గరుణలేదు. మనపరితాపమునకు మితిలేదు. (ముందునకుఁ జూచి) అదిగో! మనవాసవి వచ్చుచున్నది.

(ప్రవేశము; పూలహారమును జేతఁబట్టుకొని, వాసవి.)

వాసవి—అమ్మా! యిదిగో! దేవునకు నేను బూవులన్నియు హారముగూర్చి తెచ్చితిని. అన్ననుమాత్రమే దగ్గఱఁ గూర్చుండఁబెట్టుకొన్నావు; నేను మా నాయనతొడపైఁ గూర్చుండెదను. (తండ్రితొడపైఁ గూర్చుండును.)

కుసుమా—కుమారీ! నీముద్దుచెల్లించునంతటి భాగ్యమును నేనడిగికొనిరాలేదు.

(వాసవిని దన దగ్గఱకుఁ జేర్చికొని మూర్కొని,)

నాథా! తే॥గీ॥ కాళ్లయందెలు గల్లని - కదలుచుండ,
హాసమున మోము కళకళ - లాడుచుండ,
ముద్దుమాటలు మోదాబ్ధి - ముంచుచుండ,
వచ్చు బిడ్డలఁగను వారి - బ్రదుకె బ్రదుకు.

వీరియవు రిపుడు నన్నుఁ జింతాసాగరమున మునుఁగకుండ లేవఁదీయుటకో?
యనునట్లు నాయిరుపార్శ్వముల నాక్రమించియున్నారు.

కుసుంభ—(చిఱునగవున) స్త్రీలహృదయ మతిమృదులము. సంతాపము గాని, సంతోషము గాని, క్షణములో వచ్చుచుఁ బోవుచుండును. మనమీ సుఖానందానుభవము నందుటకు మార్పులేని విఘ్నము తటస్థించియుండెనుగదా? నీకు బిడ్డలపైఁ గల ప్రేమ, కష్టములను సైతము మఱపించుచున్నది.

కుసుమా—ప్రాణపతీ! ప్రజ్ఞానిధులగు మీరు భ్రాంతినందుదురా? నాయవివేకమిట్లో వచ్చినది. క్షణికానందము శాశ్వతమని విఱ్ఱవీఁగనుంకించితిని. క్షమింపుఁడు.

కుసుం—అమ్మా! వాసవీ! నిన్నొకదుర్మార్గుఁడు బలవంతముగ వరింపఁదలఁచినాఁడు. క్షత్రియుఁడగు నతనికి నిన్నొసఁగుటకు మేమంగీకరింపకుంటిమి.

వాసవి—తండ్రీ! నాహృదయముఁ బరీక్షింప మీరిట్లాడుచుంటిరా? క్షత్రియుఁడెక్కడ? నన్నువరించుటెక్కడ? క్షత్రియులకును వైశ్యులకును వివాహములు జరుగునా? నేనెన్నఁడును వినలేదు.

కుసుమా—విష్ణువర్ధనుఁడనురాజు నీరూపమునకుఁ దన్మయత్వము నందినాఁడఁట; తనకు నిన్నిచ్చిన సరియే; లేకుండిన నెల్లరను వధించి బలవంతముగ నిన్నుఁ గైకొనునఁట.

వాసవి—నేను వానిముఖమైనఁ జూడను. కులభ్రష్టురాలం గావలయునా?

విరూ—వాసవీ! నీవందుల కొప్పుకొనవని నేనప్పుడే చెప్పినాఁడను.

కుసుం—బిడ్డా! వాసవీ! నిన్నతని కొసఁగుటకంటె నగ్నిలోఁబడి చచ్చుట మేలనితోఁచినది. మనబంధువులును, భాస్కరాచార్యులుగారును, నదియే మంచిదని వచించిరి. ఈనిర్భాగ్యవసు జనించుటచే నిట్టియిక్కట్టులు మీరును ననుభవింపవలసి వచ్చినది.

వాసవి—(తనలో) వీరికి జన్మాంతరశాపము లనుభవించుకాల మాసన్నమైనది నా నిజస్వరూపమునుజూపి వీరిని దుఃఖమునందకుండఁజేసెదను. (ప్రకా) తలిదండ్రులారా! నాకొఱకై మీరింతదుఃఖపడనవసరములేదు. ఆరాజు నన్నువరించిన

ఫలము లేదు. దానివలన నతనికిఁ గీడు మూడకమానదు ఈవిషయములన్నియు దైవికముగ జరుగుచున్నవి కాని, మానవయత్నములు కావు.

కుసుమ—ఆహా! సమయానుసారముగ బిడ్డలకును జ్ఞానోదయమగుచున్నది. నిక్కముగ నిది దైవచిత్రమే. కుమారీ! నీకీశాంతవచనము లెవరు నేర్పిరి?

చ|| వ్రతముల నాచరించి, ధన-రాసులు దానముచేసి, నిర్మల
స్థితి మతినిల్పి, దేవిపద-సేవయొనర్చి, వరప్రసాదత
సుతుఁడును నీవుఁగల్గఁగ, వి-నోదమునందుచు నుంటి. మిప్పుడీ
గతి మిముఁగూల్చి. మేను మృతి-గాంచఁగవచ్చె నిదేమికర్మమో?

(తలవంచి కన్నుల, నీరుగార్చుచుండును.)

వాసవి—(తనలో) ఇఁక నాలస్యమొనర్చుచుండిన, వీరు మఱింత సంతాపమునందుదురు. (ప్రకా) తలిదండ్రులారా! మనమందఱు నగ్నిలోఁబడి చావకతప్పదు. నే నెవరో? భ్రాంతిచేఁ దెలియకున్నారు. మీదు దుఃఖముచేఁ గృశింపకుండ నా నిజస్థితినిఁ దెలియఁజేసెద. ఇదే మీకు దివ్యదృష్టి కలుగుఁగాక!

[ధామ్మను శబ్దముకల్గును. కుసుంభశ్రేష్ఠియు, కుసుమాంబయు, విరూపాక్షుఁడును, గన్నులుమూసికొని కొంత తడవునకుఁ గన్నులు తెఱతురు. ముంగలఁ బార్వతీదేవి ప్రత్యక్షమైయుండును. అందఱును లేచి, కరములు ముకుళించి నిల్తురు.]

కుసుం—ధన్యోస్మి. ధన్యోస్మి.

సీ|| కోటిసూర్యప్రభా - పాటలంబయి నేత్ర
పర్వమౌ తేజస్సు - పరిఢవిల్ల;
నభయచిహ్నము జప - హార పుస్తకరాజి
నాల్గు హస్తంబుల - నలువుచెంద;
సరసీరుహము దివ్య - చరణయుగ్మమునకు
నందమై ధన్యత - నందియుండఁ;
గనక సన్మణిగణా - కాంతభూషణములు
తనువున నందందుఁ - దళ్కులీన;

తే॥గీ॥ నిత్యకల్యాణ శీలవై - నియతిమెఱయ ;
సత్కృపా దృష్టిఁగనుచుఁ బ్రసన్నవైన
నిన్ను మావంటి మూఢుల - కెన్నఁదరమె ?
శాంకరీ ! ప్రోవుమా ! పాప - సమితిఁగడపి ;

కుసుమ — లోకమాతా ! మమ్మును గ్రహించి ధన్యతనందఁజేసితివి. సందర్శన భాగ్యముననే, మాదుఃఖములు నశించినవి. తమ యాజ్ఞానుసారము వర్తింతుము. రక్షింపవలయు.

విరూ — దేవీ ! తెలియక నేరములెన్నేని నొనర్చియుందుము. క్షమించి, నీదయకుఁ బాత్రునిగాఁజేయఁ బ్రార్థించెద.

పార్వతి — ఓ వైశ్యదంపతులారా! విరూపాక్షా! పూర్వజన్మమున మీరు వైశ్యశ్రేష్ఠులుగానుండి, చిత్రకంఠుఁడను గంధర్వునిచేఁ నగ్నిలోఁ బడునట్లు శాపమునంది యాతనికిఁ దలవ్రయ్యలై చచ్చునట్లు శాపమొసఁగి యెల్లరును నీభూలోకమున జనించితిరి. మీప్రార్థన నంగీకరించిన దాననగుటచే నేను మీదంపతులకు సుతనై జన్మించితిని. ఆచిత్రకంఠుఁడే, యిప్పుడు మిమ్ము నిర్బంధించెడు విష్ణువర్ధనుఁడు. కావున, మీరు దుఃఖపడనవసరము లేదు. మఱొకపరి మీకందఱకును, నాదర్శనమొసఁగి విషయములన్నియును వివరింతును. అగ్నిప్రవేశ కారణముచే మీరు నాసన్నిధిఁ జేరఁగలరు మీరు కొంతకాలమిఁకఁ గన్నులు మూసికొనుఁడు.

(ముప్వురునుఁ గన్నులు మూసికొందురు.)

పార్వతి — (తనలో) వీరికి మరల దివ్యజ్ఞానమును దొలఁగించి నేను దమ కొమార్తెనను భ్రాంతిని గల్గించెద.

(ధామ్మను శబ్దము వినఁబడును. పార్వతీదేవి యదృశ్యయై, వాసవి తనతల్లికడ కేతెంచును.)

వాసవి — అమ్మా! నేనారాజును బెండ్లిచేసికొనను మీవాక్యానుసార మగ్నిఁజొరుటకే, సిద్ధపడితిని.

కుసుం — ఔరా ! యేమి యీచిత్రము ? ప్రియసీ! మనకిది స్వప్నమా? యందఱును నిల్చియేయున్నారమే ? యావిష్యమంగళ విగ్రహము నీకుఁ గనఁబడెనుగదా ? పరబ్రహ్మాత్మికయగు నాదేవి క్షణములో నెందేగె?

కుసుమా—నాథా! యీలోకమాత, కరుణించి వచించినమాటలు నయితము జ్ఞప్తియుందున్నవి, కాని, యింతలో నెంతమాయ జరిగెను ?

విరూ—తలిదండ్రులారా! నిక్కముగ మనకాశాంకరి ప్రత్యక్షమై దుఃఖపడవలదని బోధించినది. సంశయమెందునకు ?

వాసవి—అమ్మా! యదేమి చిత్రమే ? నాకేమియుఁ దెలియలేదు.

కుసుం— తే॥ గీ॥ తల్లి! మాపాలి కల్పక - వల్లివీవ;
ముందుఁ దెలియఁగ నైతిమి - మూఢబుద్ధి;
నీమహత్త్వంబు నుతియింప - లేము మేము;
మరల మమ్మేల? భ్రాంతికి - మరపెదమ్మ!

వాసవి—తండ్రీ! నన్నిట్లు మీరు శ్లాఘించుట తగునా ? యందఱును నిటనేయుంటిమి గాని, నాకేమియుఁ దోఁచలేదు.

కుసుమా—బిడ్డా! మఱేమియు విచిత్రములేదుగాని, యీపార్వతీదేవి మాకనులకగపడి, మనలను నగ్నిలోదూఁకుటను సంశయింపవలదని నుడివినట్లయ్యె; నంతలో నామె రూపము కనఁబడలేదు.

వాసవి—అమ్మా! మీరెంత పుణ్యాత్ములు ? నాకామె యెట్లుండునో ? కలనైనఁ దెలియలేదుకదా ?

ప్రవేశము ; భాస్కరాచార్యులు.

విరూ—తండ్రీ! మనగురువుగారగు భాస్కరాచార్యులవారిదే వచ్చిరి.

కుసుం—గురువర్యా! నమస్కారములు. (అందఱును నమస్కరింతురు.)

భాస్క—భగవంతుఁడు మిమ్ములను రక్షించుఁగాక !

కుసుం—దేశికేంద్ర! మీరీపీఠము నలంకరింపుఁడు. (పీఠముఁజూపును.)

భాస్క—(పీఠముపైఁ గూర్చుండి) కుసుమశ్రేష్ఠి! విశేషములేమి ?

కుసుం—మహాత్మా! మాకింతకుముందె, కరుణించి దేవిప్రత్యక్షమై, యగ్నికుండముల దూఁకియైన మీకీర్తిని నిల్పుకొనుట శ్రేయమని వచించినట్లయ్యె. మేమును నదియే నిశ్చయించుకొంటిమి.

భాస్క—మల్లుఁడింకను రాలేదా ? వైశ్యులనందఱను విచారించుకొని, వచ్చినాఁడని వింటిని.

విధూ—ఇదేవచ్చుచున్నట్లున్నది.

(ప్రవేశము; మల్లుఁడు.)

మల్లుఁడు—గురువర్యా! కుసుంభశ్రేష్ఠీ! మీయాజ్ఞానుసారము పత్రికలనందఱకొసఁగితిని. కాని, మీబాంధవులగువారు మాత్రమంగీకరించి త్వరలో మీయొద్దకు వచ్చెదమనిరి. మిగిలిన యేఱునూట పండ్రెండు గోత్రములవారును నొకటై, కుసుంభశ్రేష్ఠి కూఁతుకొఱకు మేము ప్రాణములు పోఁగొట్టుకొనునంతటి బాధ్యత యేమియువలదు. మేమీపట్టణములయందుండినఁ గదా? రాజేమి చేయునో, యని భయపడవలయును? మాయిష్టానుసారము దేశదేశములకుఁ బోయి, యేరీతిగనైన బ్రతుకఁగలములే; పో, పొమ్మని యుల్లంఘించిరి.

కుసుం—గురువరా! వింటిరికదా? వారి దుర్వర్తనము.

భాస్క—ఆదుర్మార్గులు మనయాజ్ఞను బద్ధులుకాలేదు కనుక వంశమునకును దూరులు కావలయు వారినిఁక మీకార్యములకు వేనికిఁగాని చేర్చికొనఁగూడదు.

కుసుం—చిత్తము.

మల్లుఁడు—వారికిఁ గులముతోఁగూడ నక్కఱలేదఁట; వారి యిష్టానుసారము చెడిపోక మానరు.

భాస్క—కుసుంభశ్రేష్ఠీ! మాఘ శుద్ధ పంచమి, గురువారముత్తరా నక్షత్రమున వివాహము జరుగునట్లు నిశ్చయించితిమనియు, నాశుభలగ్నమునకై సిద్ధముగ రావలసినదనియు, విష్ణువర్ధనమహారాజునకుఁ జెప్పిపంపి యగ్నికుండముల సిద్ధము చేయించి, వారు వచ్చులోపల నగ్నిప్రవేశ మొనర్చునట్లు చేయుదము. వెండియు, మీవైశ్యవరులందఱట్లే సేయవలయును.

సీ|| మాణిక్య, భూషణ, - మంటపోద్యానాది
హితవస్తువుల, దాన - మిడఁగవలయు ;
సతి, సుత, బాంధవ - సమితిపై నెలకొన్న
ప్రేమపాశంబుల, - విడువవలయు ;
చీనిచీనాంబర - శ్రేణి, నావలవైచి,
తగిన వస్త్రంబులఁ - దాల్పవలయు ;
స్వర్లోక మందిర - ద్వారంబులో ? యనఁ,
జ్వలనకుండంబుల - నిలుపవలయుఁ,

తే॥గీ॥ కరములను వీరకంకణాల్ - గట్టి, ధైర్య
మొదవ, నా బాలగోపాల - మొనరవలయు;
వాసవీమణి, సద్భక్తి - భావగరిమ,
వీతిహోత్రునకును గాన్క - పెట్టవలయు;

కుసుం—ఇది భగవన్నియామకమనుటకు సందియము లేదు. మీయాజ్ఞానుసారము, మల్లశెట్టిని, సోమశెట్టిని, నతనికడకంపుదము.

భాస్క—మల్లా! నీవగ్నికుండములఁ ద్రవ్వించు నేర్పాటు గావింపుము.

మల్లుఁడు—చిత్తము. స్వామీ! నేనిఁక వచ్చెదను (నిష్క్రమించును.)

భాస్క—దంపతులారా! విరూపాక్షా! వాసవీ! దేవతారాధనకు, సమయమయినది. రండు. మనమును, వెడలుదము.

(అందఱును నిష్క్రమింతురు. తెరవాలును.)



# వాసవీ విలాసము.

## నవమాంకము.



( విష్ణువర్ధనుని మందిరము. )

[ విష్ణువర్ధనుఁడు శయ్యపైఁ బవళించి యోజించుచుండును. ]

విష్ణువర్ధనుఁడు—

చ॥ తలఁచినయంతఁ జిత్తము య-థాయథలై నగఁజెందుఁగాని, యా
పొలఁతి కవుంగిటన్ సుఖము[పొందెడు భాగ్యము కల్గదయ్యె; న
వ్వోలుకు మొగంబుతో, బెళుకు-లొప్పఁగ బిత్తరిచూపుఁజూచు నా
కలికి క్షణక్షణంబునకుఁ-గన్పడుచుండును, మాయమయ్యెడున్.

మన్మథా! నిన్నాబ్రహ్మదేవుఁడెందులకు సృజించెనోకదా? రూపము లేని నీ వీ పరితాపము గల్గించుట వింతగానున్నది. నీప్రభావముచే;

చ॥ నిదురయొకింతలేదు; గమ-నింపను రాజ్యవిధాన మెప్పుడున్;
బదములఁబట్టి యాత్మసతి-ప్రార్థన సల్పిన, నాదరింపఁగా
మదిని దలంపఁబోను; గడు-మంజులమైన పదార్థజాలముల్
పెదవికి సోఁకనీయను; వి-వేకము నెంచను; భ్రాంతినందుదున్.

ఆ బాలనాగరుల సమితము నన్ను వంచించినని తోఁచుచున్నది. లేకుండిన, శీఘ్రముగ నాబాలను నాకొసఁగి వివాహ మొనర్చు ప్రయత్నముఁ జేసెదమని ప్రతిజ్ఞయొనర్చి, నన్నిటకుఁబంపి, తిరిగియైనఁ జూడకుందురా? మనస్సొకదానిపై లీనమగుట సులువుకాని, తక్ష్వాతి వెనుదిరుగుట కడుఁగష్టము. నాకా కన్యాకామము తొగకమైనది. దైవమనుకూలింపఁడయ్యెను. (యోజించి) నేనెందఱనో? సుందరాంగులఁ జూపితినిగాని, యా యొయ్యారి, కన్యక యయ్యు, నన్నుఁ దియ్యవిలుకానిబారికి గుఱిచేసినది. అదేమిచిత్రమో? కాని,

యొకపరి యాబాలిక విలాసముగ నాయెదుటఁ గన్పడినట్లగును. మఱియొకతూరి దేవీరూపయై గోచరించినట్లగును. పరమాత్మస్వరూపిణియని చింతింతునా? వెంటనే, మితిలేని యొయ్యారములఁజూపు తొయ్యలియై కాన్పించును. కౌఁగిలింపఁగోరి సమీపమున కరుగుదునా? తత్క్షణము మాయమైపోవును. నా హృదయమునఁగల భ్రాంతియే, యిన్నివిధముల మార్పుఁజెందించుచున్నది. ఎట్లైనను నాకన్యకారత్నమును జేపట్టక బ్రతుకఁజాల; (దిగ్గనలేచి) అదిగో! నావలపులకలికి ;

క|| బాలా! హృదయ విలోలా!
నీలీలలఁ గాంచినాఁడ; - నీసేవకుఁడన్;
లాలింపుము; దరిఁ జేర్పుము;
బేలించెద వేల? రమ్మా! - ప్రియగుణజాలా!

(చేతులఁజాచికొని) ఏదీ? యిప్పుడే, మాయమయ్యెనా?

చ|| వలచిన వానినిల్లు తగ - వా? మగువా! పగవానిరీతిగాఁ
దలఁగుట; కౌఁగిలింప వల - దా? కలదా? నెలదాయబారి,నన్
నిలుపుట; నీవియోగమున, - నే, మననేరను; నేలవే' నన్నున్ ;
బిలిచిన, బెట్టుచేసెదవు; - ధీరమ? క్రూరమ? నేరమా? చెలీ!

ఛీ! తుదకు నాకీగతిపట్టెను. (శయ్యపైఁగూర్చుండును.)

ప్రవేశము; కుమారకంఠీరవుఁడు.

కుమా—(తనలో) ఔరా! ధీరగుణోపేతుఁడగు నీమహారాజు వైశ్యకన్యకకై యెంత బెంగవడియుండెను? అనవరతము ధర్మాధర్మ వివేచనాచణుఁడై, దుష్కర్మలఁ గనిన, మండిపడుచుండునట్టి యితఁడిప్పుడు సుబోధములను జెవికడనైనఁజేర్పఁడు (ప్రకా) దేవా! వందనములు. (నమస్కరించును.)

విష్ణు—మంత్రీ! కుమారకంఠీరవా! సమర్థులగు మీరు నామనోరథమును నెఱవేర్పఁ జాలకుంటిరి.

కుమా—మహాప్రభూ! మేము తగిన ప్రయత్నముల నొనర్చుచునే యున్నారము.

పెనుగొండనుండి వైశ్యులు సైతము, వారిలో బుద్ధిమంతులగు నిరువురను నిచటికిఁ బంపినారు.

విష్ణు—ఏమీ! పెనుగొండనుండి యిరువురు వైశ్యులిచటి కేతెంచిరా? వారిబాలికను నా కొసఁగుటకు సమ్మతించియేకదా! వచ్చియుందురు. వారిపుడెచటనున్నారు?

సుమా—మనగురువుగారగు ధౌమ్యమహర్షి సన్నిధినున్నారు. కొంతతడవునకు వారును, గురువుగారును, నియ్యెడకరుదెంతురు.

విష్ణు—మంత్రీ! మనసేవకునితోఁ గొన్నిపీఠముల నిటసిద్ధపఱపవలెనని యాజ్ఞాపించి, నీవు త్వరగా వెడలి, వారిఁ దోడ్కొనిరమ్ము.

సుమా—దేవా! యింత తొందరయెందులకు? మనకొఱకై వచ్చినవారు, మనయింటికి రాక మానుదురా?

విష్ణు—వారి యభిప్రాయములు తెలియువఱకును, నామనమునకు స్వస్థతకుదురదు. కావున, నామాట మేరకు నొనర్పుము. పొమ్ము.

సుమా—చిత్తము. (కొంచెము ముందునకు నడచి, తనలో) ఇతనికీ విపరీతానురాగము జనించుట వింతగనున్నది.

తే॥గీ॥ ఆదినుండియు మిగులఁ బ్రే - మాస్పదంబు
చేత నెదికోరినను, ఫల - సిద్ధిఁగనదు;
దైవ మనుకూలమైవచ్చి - దయనుగాంచ
నాశవదలిన వన్నియు - నబ్బుచుండు;

ఇంతకును, బ్రాప్తమెట్లున్నదో, యావిధమున జరగకమానదు. విధి లేక యొప్పికొనినను, వైశ్యులుమాత్ర మితని దుర్గుణములను దలంచి చింతింపకుందురా? వారీకార్యమున కెన్నియుక్తుల నాలోచించియుందురో? యనుభవించినఁగాని తెలియదు. (నిష్క్రమించును.)

[సేవకుఁడు గొన్నిపీఠములఁ గైకొనివచ్చి యటనమర్చి ప్రభువునకు నమస్కరించి వెడలిపోవును.]

విష్ణు—(తనలో) ఇఁక నాకోరిక నెఱవేఱి తీరుననుటకు సందియములేదు. వారికా, బాలికనిచ్చు నిష్టమే లేకుండిన, నాయెదుటకు రాసాహసింపరు. గురువుగారితో మాటలాడుటకును హేతువుకలదు. ముహూర్తనిర్ణయమునకై వారినాశ్రయించియుందురు. నేఁటికి నామనోరథము పవిత్రమైనది.

పనికిరావు. నీప్రాయపుఁ గుమారునకుఁ బట్టముగట్టి హరినామకీర్తనముతోఁ గాలము గడుపుటుత్తమము.

విష్ణు—రాజ్యమునీనాఁడే కుమారుఁడేలుకొనవచ్చును. గాని, రాజ్యమును వదలినను నేనాకన్యకను విడువను.

ధౌమ్య—(తనలో) ఔరా! యెంత మూర్ఖము? (ప్రకా) ప్రభువర్యా!

సీ|| ప్రాయమంతయుఁ జెల్లి - పోయె నింకను నాకు
సవతిపోరని భార్య - సంకటపడ,
వయసు మీఱినఁగాని - వైశ్యకాంతనుగోరెఁ
గాముకుఁడని బిడ్డ - కంటగింపఁ,
గులముగాని కులంబుఁ - గూడె నీతండెంత
యజ్ఞానియని జను - లాడుకొనఁగ,
గనుఁగొన్న మాత్రనఁ - గామించు మిక్కిలి
దుష్టుఁడంచును సతుల్ - దూరుచుండ,

తే||గీ|| నపయశస్సునఁ బొందె, నీ - వందు లాభ
మేదియో? చింతసేయుమా! - హృదయమందు;
నీకు వచియించు బాధ్యత - నాకుఁగలదు
గనుకఁ దెల్పితి; వినెదవో? - కాదనెదవొ?

విష్ణు—గురువర్యా! లేనిపోనిమాటలచే నన్నేల భయపెట్టెదరు? మీరును దప్పక నా వెంట రావలయును. ముహూర్తసమయమునకు మనమా పెనుగొండఁజేరి తీరవలయును.

ధౌమ్య—(తనలో) ఇంక నితనికిఁ జెప్పరాదు నొసఁటివ్రాఁత ప్రకారమనుభవింపక తప్పునా? (ప్రకాశముగ) మీయభీష్టానుసారముగనే చేయుఁడు. నేనిఁక వచ్చెద. (నిష్క్రమించును)

విష్ణు—ముహూర్తమునకై వలయు పనులను దయారుచేయించి, పెనుగొండకరుగు ప్రయత్నము సేయుట ముఖ్యము. (నిష్క్రమించును.)

— తెరవాలును. —

# వాసవీ విలాసము.

## దశమాంకము.

---

(పెనుగొండపుర బాహ్యస్థలము.)

(వీరాకారముతో, ఖడ్గమును ధరించి మల్లుఁడు ప్రవేశించును.)

మల్లుఁడు—(అగ్నికుండములు వెల్గుచుండ, వానిచుట్టును దిరిగి యొకచోనిల్చి) కులగౌరవమునకై దుష్కరకార్యమొనర్ప సాహసించిన పుణ్యాత్ములగు వైశ్యులకుఁ గీర్తి కరతలామలకము. ఇదిగాక, యీవాసవాంబ పార్వతీదేవియే యనియుఁ, దలిదండ్రులకొకనాఁడు తన నిజరూపమును జూపియున్నదనియు, వింటిని. గురులగు భాస్కరాచార్యులుగారీనాఁడు వైశ్యవరులకెల్లరకు నగ్నిప్రవేశమునకై, కంకణములొసఁగియున్నారు. చిన్ననాఁటినుండియు వాసవాంబను నాబిడ్డలకంటెఁ బ్రీతిగఁ గాంచుచుండిన,నే నాబిడ్డ యగ్నిలోఁబడఁ గన్నులారఁ జూచుటెట్లు? గురువుగారిచేఁ గంకణము వడసి నేనును నామె వెంట నగ్నికాహుతి యయ్యెద. ఇతరులెవరేని, నగ్నికుండములదూఁకు వైశ్యుల కాటంకముగలుగఁ జేయుదురేమో? యను భయమున నెవ్వరుగాని నన్నుఁజూచినంతనే, దూరమునుండియే వెనుకకుఁ బరుగిడునట్లు వికారస్వరూపమునుదాల్చి ఖడ్గమును ధరించి యున్నాను. విష్ణువర్ధనుఁడుగాని, వానిభటులుగాని, యొకవేళ ముందుగ నిటకేతెంచి భంగమొనర్ప సాహసించినయెడల, నాచేతనున్న కత్తిచేఁ గడికండలు గావించెద. అమ్మా! ఖడ్గాధిదేవతా!

చ|| పరజన కంఠలుంఠన వి-భారుధిరప్లవ కేళిఁ దేలి, నా
కరము నలంకరించితివి;-కాని, యిఁకం బ్రళయాగ్నిహోత్రికా
తర బహువైశ్యశీర్షములఁ-దాఁకెదొ? దుర్మతి విష్ణువర్ధనో
ద్ధురభట కోటిపై కుతికి-తుళ్ళించి రహించెదవో? తలంపుమా!

(కత్తినిజళిపించును.)

[భాస్కరాచార్యులును, గుసుంభశ్రేష్ఠియుఁ, గుసుమాంబయు, వాసవీకన్యయు, విరూపాక్షుఁడును, ధనదుఁడును, వైశ్యులు కొందఱును, సువాసినులు కొందఱును, మంగళద్రవ్యములతో నరుదెంచి, క్రమముగ నిల్తురు.]

భాస్క—కుసుంభ శ్రేష్ఠీ! యీమల్లునకు మీపైఁగల భక్తిభావము చూచితివా? మన వాక్యానుసారము భయమునుగలిగించు రూపముతో, నగ్నికుండములకుఁ గాఁపుగ నున్నాఁడు.

కుసుం—అతనికిఁ దగిన మేలేమి సేయవలయునో? తోఁచకున్నది.

మల్లుఁడు—గురువర్యా! వైశ్యులారా! వందనములు. (నమస్కరించి) వాసవాంబకు సేవకుఁడనై, యామెయందు భక్తియుఁ బ్రేమయుఁ గలిగిన నేను, నగ్నికుండమున దూఁకుదును. కనుకఁ గంకణము దయసేయవలెను. మీరు వలదనినను, నేను వినుటలేను, ఆతల్లి; దేవితావతారమేగాని వేఱుకాదు. నాకట్టి నమ్మకము కల్గినది.

భాస్క—మంచిది. నీకోర్కెకి భంగము సేయక, కంకణమిచ్చెదను.

ధన—గురువర్యా! నే నెంత బ్రతిమాలినను, గంకణమొసఁగకున్నారు. కులగౌరవము కంటె, జీవితముపైఁగల యాశగొప్పది కాదు. తప్పక నాకును గంకణమిచ్చి తీరవలెను.

కుసుం—ధనదా! నీకు సంతానముకూడ లేదు. నీవంశమే, యింతటితో నంతరించును, గనుక, నీమూర్ఖమును వదలుము.

ధన—మీరందఱును బ్రాయోపవేశ మొనర్చి, దేవీకటాక్షమునకుఁ బాత్రులగుచుండ, నేనంతటి క్రూరకర్ముఁడనా? నాకీప్రపంచముతోఁ బనిలేదు

భాస్క—ధనదా! నీవింక నూరకుండుము. నీయభిప్రాయానుసారము, నిదే, కంకణ మొసఁగుచున్నాను. (కంకణమిచ్చును.)

ధన—(కంకణముఁగైకొని) గురువర్యా! ధన్యుఁడనయితిని.

భాస్క—మల్లా! యిదిగో! నీకును గంకణమిచ్చెదను. (ఇచ్చును.)

మల్లుఁడు—(కంకణమొంది) ఒక్క వాసవాంబకొఱకై, మనమిందఱము ప్రాణములను వదలినను, మనకు నష్టములేదు. శాశ్వతమగు దేవీసాన్నిధ్యము కలుగును.

కుసుం—బాంధవులారా! మీరెల్లరును నావిజ్ఞప్తినిఁ జిత్తగింపవలయు. మనతోపాటు నీమల్లుఁడు, ప్రాణత్యాగమొనర్చుటకు సాహసించెను గనుక, నితని వంశముండు నంత పర్యంతము, మనవంశమువారు మల్లునివంశమువారినిఁ బోషింపుచుఁ బ్రతి కార్యమునకును వారిసాహాయ్యమును బొందుటకై తగినయేర్పాట్లు గావింపవలెను. మఱియు, మనగురువులగు భాస్కరాచార్యులుగారికి శాశ్వతమగు మర్యాదలు జరుగునేర్పాట్లు గావింపవలెను. ధనదుఁడగ్నిప్రవేశ మొనర్చినవెనుక, నతని

గోత్రము వారెవ్వరుగాని, వంశము నుద్ధరించుటకు లేరు. మనవారాతని నామమునైన, మఱవక స్మరించుటకై తగినయేర్పాటును గావింపవలయును.

వైశ్యులందఱు—మంచివిషయములను బోధించితిరి మీయాజ్ఞానుసారము, వీనికన్నిటి కిని దానశాసనములు వ్రాయవలెను.

కుసుం—ఆ కార్యము, మీలో యోజనాపరుఁడగు నెవఁడేని నిర్వహించి, యందఱ యనుమతిని బొందుటమంచిది.

కుసుమా—(భాస్కరాచార్యునకును, గుసుంభశ్రేష్ఠికిని, నమస్కరించి) గురువర్యా! ప్రాణనాయకా! మీరిరువురును నామాటల నాలకించి, కోర్కెఁదీర్పవలయును.

ఉ॥ చేసితి దానధర్మములఁ-జేసితి సద్వ్రతముల్ సమస్తముఁ,
జేసితి దేవపూజలను,-జేసితి యోగిసమర్చనంబు, నేఁ
జేసిన పుణ్యకార్యములు-చిన్నికొమారిత నగ్నిపాలుగాఁ
జేసెను సత్ఫలంబు నిదె,-చెప్పఁగఁజాల! మదీయకర్మముఁ.

సువాసినులు—(కన్నుల నీరునించుకొని) అమ్మా! నీప్రాప్తమున కెంతదుఃఖపడినను దీఱదు.

కుసుమాంబ—

సీ॥ అల్లారు ముద్దుగాఁ - జెల్లెలితో నాదు
ప్రాప్తంబు నాసుతుఁ - బాసిపోయె;
జీవించి, కోరిన - జీవితేశువరించు
భాగ్యంబు నాసుతఁ - బాసిపోయె;
దనివారఁ బిడ్డలఁ - గని సంతసంపడు
ప్రాప్తంబు మమ్ములఁ - బాసిపోయె;
మము నెల్లరను బ్రీతి - మన్నించు భాగ్యంబు
బంధులా మిమ్ములఁ - బాసిపోయె;

తే॥గీ॥ నందఱును నగ్నికుండము - నందు ముందు
వాసవినిఁద్రోసి, పాపియా - వసుమతీశు

కన్నులకుఁ బండువునొనర్చు - కాలమొదవెఁ
గటకటా! దేవునకు దయ - గల్గదయ్యె.

నేనీఘోరమును జూడఁజాలను. ముందుగ నేనాయగ్నిలోఁబడెద. అటు తర్వాత నేమి జరిగినను. జరగవచ్చును. నావిన్నపమాలించి యనుజ్ఞనొసఁగుడు. (దుఃఖించును.)

వాసవి—(తల్లికడకేతెంచి) అమ్మా! అమ్మా! యెందుకేడ్చెదవే?

కుసుం—నిక్కముగ నీముద్దులపట్టినిఁ గాంచిన,ఁ గఠినశిలాసదృశమగు హృదయమైనను, గరఁగి నీరై పోకమానదు.

తే॥గీ॥ వెక్కి యేడ్చుచునున్న న - వ్వించు నేర్పు;
కోపమును బొందఁ గూరిమిఁ - గూర్చు నేర్పు;
తృప్తినందినఁ గొఱంతలఁ - దెచ్చు నేర్పు;
చిన్నిబిడ్డలదే కదా? - క్షితి తలమున.

వాసవి—(తనలో) వీరిఁక నమోఘదుఃఖమునకు గురియగుదురు. వీరి యజ్ఞానమును బాపి, తగిన ధర్మములను బోధించెద.

(ఢామ్మను శబ్దమగును. వాసవి, పార్వతీరూపమై యందఱ మధ్యను నిల్చును. ఎల్లరును గరముల మొగిడ్చియుందురు.)

పార్వతి—వైశ్యశ్రేష్ఠులారా! నేను బార్వతిని. పూర్వజన్మమున మీప్రార్థనలఁ గరుణించి, యిప్పుడీ కుసుమాంబగర్భమున జన్మించితిని. కైలాసమున మీరును, జిత్రకంఠుఁడను గంధర్వునును బరస్పరశాపములు పొందఁగల్గెను. మీరగ్నిలోఁ బడు కారణములందుచేకే యొనఁగూడినవి. మీరా చిత్రకంఠునకు, "భూలోకమున మేమగ్నిలోఁ బడునప్పుడే తలపగిలి చత్తువుగాక" యని శాపమిచ్చియుంటిరి. కావున, వాఁడిచ్చట విష్ణువర్ధనరాజుగా జన్మించి నన్నువరించి మిమ్మందఱ నిర్బంధించినాఁడు. మీరగ్నికుండములఁ బ్రవేశించిన తత్క్షణము రాజుతల వ్రయ్యలగును. ఇదిగాక, మీరెల్లరు నగ్నిలోఁబడుట సరికాదు. మీ వంశము భూలోకమున లేకపోవును గనుక, ద్వ్యాక్షరేయగోత్రమున కొకఁడును, ద్రాక్షిరేయగోత్రమున కొకఁడును, జతుకాక్షరేయగోత్రమున కొకఁడును,

దశార్ణేయ గోత్రమున నొకఁడును, మిగిలిన గోత్రముల నొక్కొక్క దానికి నొకఁడు మేరకు మాత్రమగ్నిప్రవేశము సేయుఁడు. మీనూటరెండు గోత్రములవారికిని జిరకీర్తి లభించును. పూర్వము కృతయుగమున;

సీ॥ మహితగుణుండు స - మాధియను వైశ్యుండు
నన్నుఁగూర్చి తపముఁ బో - నర్చినపుడు,
తండ్రిపార్శ్వంబునఁ - దనరు నిర్వదినాల్గు
గోత్రంబులనుగల - గుణయుతులను,
మాతృసంబంధులై - మనిన యిర్వదిగోత్ర
ములవారి, నత్తింటి - కులమువారి
ద్వాదశగోత్ర సం - భవులను, దోఁబుట్టు
నన్వయులగు పదు - నాఱుగోత్ర

తే॥గీ॥ ములను వెలసిన వారిని, - బుత్రకొలము
వారిఁ బదునొక్క గోత్రాల - వారి, మఱియుఁ
దల్లితోఁబుట్టునకును బాంధ - వులునైన
యష్టగోత్రజులను, మేన - యత్త కొలము
వారి దశగోత్ర భవులఁ బ్రో - వంగఁగోరె;

ఆ సమాధియే, శాపవశమున నిప్పుడు కుసుమశ్రేష్ఠియై జన్మించినాఁడు. వైకుంఠమున, దుర్వాసోముని మీగోత్రములలో నూటరెండు గోత్రములవారు దప్ప, మిగిలినవారు కులభ్రష్టులగుదురని శాపమిచ్చియుండె; దానికై యాఱు నూటపండ్రెండు గోత్రములవారును, గులాభిమానమును విడిచినారు. వారిక నీచజాతులలోఁ గలిసిపోవుదురు. మల్లుఁడును బూర్వజన్మమున భృగుమహర్షిచే శాపమందిన కారణమున, నగ్నిలోఁబడు విధికల్గినది.

భాస్క—జగన్మాతా! శాంకరీ! పూర్వజన్మముల వృత్తాంతమును సైతము తెలిపి, వైశ్యులను ధన్యులఁగావించితివి.

చ॥ తెలియఁగలేరు నీమహిమ, - ధీనిధులైనను, మర్త్యలోకమం
దలి జనులెల్ల; నేఁడిదె, య - నంతఫలం బొనఁగూడె మాకు నీ
లలిత కృపావినోదగుణ - లాలసులైతిమి; కన్యకాంబవై
కులము సముద్ధరించితివి; - కోర్కులొసంగితివమ్మ! నెమ్మదిన్.

పార్వతి—విప్రోత్తమా! బ్రహ్మాంశసంభూతులగు మీరు వీరికి గురువులై, సముచిత ధర్మములను బోధించుట శ్లాఘనీయము. ఈవైశ్యులలో సౌందర్యాదులుగలవారుండిన, నెన్నఁటికేని బలవంతులగు కాముకీ కాముకులచే బాధలు కల్గుచుండును, గనుక,

తే॥గీ॥ దేహసౌష్ఠవమో? లేక - దివ్యకళయొ?
శ్రేష్ఠతరమైన వాణియో? - ప్రియగుణంబొ?
యెంచ నేదైన నొకటి లో - పించుఁగాక!
వసుధయందున, నీవణి - క్ప్రతతికరయ;

మఱియు, విష్ణువర్ధనుని కుమారుఁడగు రాజరాజేంద్రుఁడును, ధౌమ్యర్షియు, ముందుగ నిటకే తెంతురు. కుసుమశ్రేష్ఠి కొమారుఁడగు విరూపాక్షునకును, రాజరాజేంద్రునకును, విష్ణువర్ధనుఁడు వచ్చులోపల, లాంఛనముగ, వారివారి పట్టణములకై, వారికిఁ బట్టాభిషేకము లొనర్పుఁడు. రాజరాజేంద్రుఁ డిష్టపడనిచో దేవి మాకుఁ గలలో వచించినదనియు, నీకార్యము ముందుగ జరగనియెడల మాబిడ్డను మీతండ్రి కొసంగమనియుఁ జెప్పుఁడు వారికినిఁ దగినబుద్ధిఁ బుట్టించెదను.

ఒకఁడు—భగవతీ! తప్పక మీయాజ్ఞానుసార మొనర్తుము.

భాస్కర—మాతా! వైశ్యులలో మంచిచెడ్డలెఱుఁగఁదగిన పెద్దవారలగ్నిప్రవేశ కారణముచే, నీసన్నిధినిఁ జేరుకొందురు. మిగిలినవారేయేధర్మముల నాచరింపవలెనో? దయయుంచి వచింపఁ బ్రార్థించెద.

పార్వతి—వైశ్యులగు వారెల్లరును, మాతులకన్యావివాహమును వదలఁగూడదు. మేనఱికపుధర్మమును గర్వముచే విడిచిపెట్టినవారికిఁ గీడుమూడకమానదు. మఱియు, ముఖ్యములగు దశలింగము లనువాని నెఱిఁగి సదాచారులై వర్తింపవలయు; నవి యేవియనిన,

తే॥గీ॥ గోత్రమును, ఋషి, దానంబు, - క్షేత్రములును,
దేవతాఖండ దీపముల్, - దివ్యజపము,
తప మొనర్చిన తావును, - దత్తటాక
నామమును, దేవుఁడు, విసర్జనంబు, లనఘ !

వీని వివరణమంతయు, మీకు, నాకరుణచే, వైశ్యజన ముఖ్యగురువులగు సాలంకాయనమహర్షి వలనఁ దెలియఁబడును. మీ రావిధమున వారిచే నాచరింపఁ జేయవలయును. ప్రాకృతగోత్రములకెల్ల, సాలంకాయన సూత్రము ముఖ్యము.

భాస్క—వైశ్యులారా! దేవీవచనములను వింటిరికదా? యామెచే వచింపఁబడిన ధర్మములను మీ రెన్నటికిని విడువఁగూడదు. ఆలోకమాత, కరుణించి భూలోకమున నీవైశ్యదంపతులకు జన్మించిన దినము. వైశాఖ శుద్ధ దశమి శుక్రవారము గనుకఁ, బునర్వసు నక్షత్రయుక్తమగు నాదినమునఁ బ్రతివత్సరమును, దేవీమహోత్సవమును జల్పుట మీవిధి.

ఒకఁడు—గురువర్యా! మాయభిప్రాయమును దెలిసి మాటలాడితిరి. మీకును, మల్లుని వంశమువారికిని, జరగఁదగిన మర్యాదలను విశదముగ వ్రాసి, శాశ్వతముగ నుంచితిమి. మే మగ్నిప్రవేశ మొనర్చినను, బాలురకు సయితమవి, ప్రమాణములు కాఁగలవు. ధనమని నామమునకు బదులు ప్రతికార్యమునకును ముందు మన వారు, లాభమని పల్కుచుండవలసినదిగా నిర్ణయించితిమి.

పార్వతి—వైశ్యులారా! మీ రొనర్చిన కార్యములన్నియు శ్రేష్ఠములు. ఈ మల్లుని వంశమువారును, మైలారులను నామమున వృద్ధినంది, నాకును భక్తులై; మీరు వచించు కార్యములఁ జల్పుచుందురు.

[ వైశ్యులెల్లరును మంగళద్రవ్యములు దేవిసన్నిధియందిడి, పూలహారముల నామెపైవైచి, సువాసినులొకప్రక్కను, ఋషులొక ప్రక్కను, నిల్తురు. భాస్కరాచార్యుఁడును మల్లుఁడును దేవికభిముఖులగుదురు. ]

పార్వతి—విష్ణువర్ధనుఁడు మొదలగువారు వచ్చుసమయమైనది. ముందు, నేను దెల్పి యుండినరీతి విష్ణువర్ధనుని కుమారునకును, గుణుంభ శ్రేష్ఠికుమారునకును బట్టాభిషేకము లొనర్పుఁడు. ఆ రాజుకూడ, నాకుఁ బరమభక్తుఁడు గావున, శాపము చెల్లిన వెంటనే, మీతోపాటు నాసాయుజ్యము నందఁగలఁడు. గోత్రమున

యందఱును మంగళహారతిఁ బాడుచుందురు. విరూపాక్షునిపై, రాజరాజేం ద్రునిపైఁ బూలనువైచుచు, భాస్కరాచార్యులును ధౌమ్యమహర్షియు నిల్చియుందురు.)

ధ్వాన్తమను శబ్దముకలుగును. తెఱవాలును.

—♦ గద్య. ♦—

ఇది, శ్రీరామచంద్ర బాలాత్రిపురసుందరీవరప్రసాద లబ్ధసరసకవితాధురంధర,
సోంపల్లెకులకలశాంబోరాశిరాకాసుధాకర, రథీతరగోత్రపవిత్ర, సుగుణ
కదంబ మంగమాంబాగర్భశుక్తిముక్తాఫల, వంజయార్య ప్రధాన
తనూభవ, విద్వాన్, బాలకవిసింహ, అష్టావధానీ,
త్రిబిరుదనామ సమేత యశోవైభవ, పండితకవిమిత్ర
లక్ష్మీనరసాంబానుకళత్ర, సజ్జనవిధేయ,
కృష్ణమూర్తినామధేయప్రణీతమగు
వాసవీ విలాస నామక
దశాంక నాటకము
సమాప్తము.

---

ఓం శాంతి, శ్శాంతి, శ్శాంతిః
శ్రీరామచంద్రపరబ్రహ్మార్పణమస్తు.
శ్రీబాలాత్రిపురసుందరీ చరణారవిందార్పణమస్తు.



బ్రిటానియా ముద్రాక్షరశాల, మదనపల్లె.

# తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 25 | పండితశ్రీవనల్ | పండితాశీస్సులు |
| 3 | 3 | విద్యాక్షబరీక్ష | విద్యాక్షపరీక్ష |
| 4 | 18 | ముప్పావగూడును | ముప్పాసగూడును |
| 6 | 15 | మాధవా ; | మాధవా ! |
| 8 | 11 | మోనులు | మానులు |
| 10 | 16 | ఇగ్గినముగ్గుగుళ్లో | ఇగ్గినము, గుళ్లో |
| 13 | 17 | తిరిపూర్ణ | పరిపూర్ణ |
| 20 | 5 | మనస్సువంతయు | మనస్సునంతయు |
| 22 | 10 | నెడలుటయు | వెడలుటయు |
| 22 | 12 | మాటలకిచ్చిగించి | మాటలకిచ్చగించి |
| 24 | 3 | అయ్యా ; | అయ్యా ! |
| 27 | 4 | కొంతతడవునకు, గౌరీశంకరులకు, | కొంతతడవునకు - గౌరీశంకరులతోఁ బ్రవేశింతురు. ఎల్లరును గౌరీశంకరులకు, |
| 33 | 7 | గోత్రములువారు | గోత్రములవారు |
| 39 | 12 | తల్లడిల్లంగ | తల్లడిలంగ |
| 48 | 10 | నెక్కఁబెట్టుపందు | నెక్కఁబెట్టుకుందు |
| 51 | 10 | గావడి | గావిడి |
| 52 | 18 | వస్తువుతో | వస్తువులతో |
| 52 | 26 | నేను వెడలి | నేను వెడలి |
| 55 | 26 | శృంఖములు | శృంఖలములు |
| 56 | 20 | కార్యసాధనము | కార్యసాధనము |
| 57 | 9 | యనుజ్ఞచేసె | యనుజ్ఞచేసె |
| 62 | 27 | మాలిశిషు | మాలిశిష్టు |

